# చరిత్ర రచనలో అగ్రగణ్యులు

కొమర్రాజు లక్ష్మణరావు



మల్లంపల్లి సోమశేఖరశర్మ



రచన
కీ.శే. తిరుమల రామచంద్ర

సంపాదకుడు
డా॥ జి. వెంకటేశ్వరరావు

మల్లంపల్లి సోమశేఖరశర్మ చరిత్ర అధ్యయన కేంద్రం
నెల్లూరు

# నివేదన

.... **ఆ**ంధ్రదేశ చరిత్ర ఎంత గొప్పదో.... ఆంధ్రదేశ చరిత్రకారులు కూడ అంతటి గొప్పవారు. చరిత్ర రచన కోసం తమ జీవితాలను అంకితం చేసిన ఆంధ్రదేశ చరిత్రకారులు ఎంతో మంది ఉన్నారు. వారిలో - కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, చిలుకూరి వీరభద్రరావు, కావలి వెంకట బొర్రయ్య, నేలటూరి వెంకట రమణయ్య, సురవరం ప్రతాపరెడ్డి, డా॥ బెండపూడి సుబ్బారావు, దిగవల్లి వెంకట శివరావు.... ఇలా. ఎంతమందో చరిత్రకారులు. వీరు ఆంధ్రదేశ చరిత్రకు చేసిన కృషి అనన్యసామాన్యమైనది.

ఈ గ్రంథంలో కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మలను గురించి ప్రముఖ సాహితీవేత్త తిరుమల రామచంద్ర వ్రాసిన జీవితచరిత్రలు స్ఫూర్తిదాయకమైనది.

తెలుగువారి వికాసానికి, సాంస్కృతికంగా వారి అభివృద్ధికి కొమర్రాజు లక్ష్మణరావు చేసిన కృషి అపూర్వమైనట్టిది. 'విజ్ఞానచంద్రికామండలి'ని స్థాపించిన లక్ష్మణరావు ఎన్నో చారిత్రక గ్రంథాలను ప్రచురించి ఆంధ్రదేశ చరిత్రకు ఎనలేని సేవ చేశారు. తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని తయారుచేయాలనే పనిని ప్రారంభించి జీవితకాలమంతా దానికోసం కృషిచేసిన ధన్యజీవి ఆయన. తిరుమల రామచంద్ర - లక్ష్మణరావు ఆంధ్రదేశ చరిత్రకు చేసిన సేవను గురించి, విజ్ఞానచంద్రికా మండలిని గురించి, ఆయన వ్యక్తిత్వాన్ని గురించి చక్కగా వర్ణించారు. లక్ష్మణరావు చరిత్రకారునిగా, సాహితీవేత్తగా లబ్ధప్రతిష్ఠుడు, ఆయన ఒక సృజనాత్మక రచయిత.

ఇక మల్లంపల్లి సోమశేఖరశర్మ జీవితాన్ని గురించి ఈ గ్రంథంలోనే తిరుమల రామచంద్ర వ్రాసిన విషయాలు అనన్య సామాన్యమైనవి. 1991 వ సంవత్సరంలో నెల్లూరు శ్రీ సర్వోదయ కళాశాలలో జరిగిన ఆం.ప్ర. హిస్టరీ కాంగ్రెస్ 15వ సదస్సులో జరిగిన 'మామిడిపూడి వెంకట రంగయ్య స్మారక ఉపన్యాస కార్యక్రమం'లో చదివిన సుదీర్ఘమైన వ్యాసం యిది. మల్లంపల్లి వారు ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి, కళలను గురించి అనేక పరిశోధక వ్యాసాలను వ్రాశారు. వారు వ్రాసిన చరిత్ర గ్రంథాలలో వారి చరిత్ర రచనాపద్ధతి, వారి శైలి, వారి శాస్త్రీయ దృక్పథం వారి గొప్పతనం తెలుస్తున్నది. ఆయన చదివింది యస్.యస్.యల్.సి. అయినా ఆంధ్ర విశ్వవిద్యాలయ ఎం.ఏ. విద్యార్థులకు ఎపిగ్రఫీని (శాసనాలు) న్యూమిస్‌మేటిక్స్ (నాణెములు) ను బోధించి మెరికల లాంటి విద్యార్థులను తయారుచేశారు. ఆయనకు అత్యంత ప్రీతికరమైన పని - శాసన పరిశోధన. అందుకే ఆయన 'శాసనాల చరిత్రకారునిగా' ప్రసిద్ధి గాంచారు. మల్లంపల్లి వారి సమకాలికునిగా ఉండి, ఆయనను దగ్గర నుంచి గమనించి అద్భుతమైన విషయాలను పాఠకలోకానికి అందించారు తిరుమల రామచంద్ర. ఆయన మాటల్లో చెప్పాలంటే

"-మన అదృష్టం.... ఆంధ్రుల అదృష్టం.... ఆయన సర్కారీ నౌకరీ దాస్యంలో పడకుండా చరిత్రరంగంలో పడ్డారు. తాను, క్రొవ్వొత్తిలాగా హరించుకపోయినా, తెలుగుజాతికి వెలుగునిచ్చారు" అని వ్రాశారు.

పైన చెప్పబడిన రెండు గ్రంథాలను ముద్రించుకోడానికి ఆయన మాకు అనుమతిని ప్రసాదించడం మా అదృష్టంగా భావిస్తున్నాము.

ఈ గ్రంథంలోనే మల్లంపల్లి వారి మేనల్లుడు శ్రీ ఇవటూరి కామేశ్వరరావు వ్రాసిన "నవ్యాంధ్ర విద్వన్మహాపురుషుడు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ" అనే వ్యాసం 'శర్మ' గారి పట్ల ఆంధ్రులకున్న గౌరవాన్ని ఇనుమడింపచేస్తుంది.

ఇక – ఈ గ్రంథంలోనే స్వయాన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మ 1940 సంవత్సరంలో 'ఆంధ్రపత్రిక' ఉగాది సంచికలో వ్రాసిన వ్యాసం "- 'సుప్రయోగ'నది ఏది? – అది ఏ నామాంతరముతో నేడు వ్యవహరింపబడుచున్నది." – ఈ వ్యాసం శర్మగారి పరిశోధనాపటిమకు ఒక నిదర్శనంగా చెప్పవచ్చును. ఈ వ్యాసంలో – పెన్నానదియే. (నెల్లూరు ప్రక్కన ఉండిన పెన్న) సుప్రయోగానది అని తన శైలిలో తేల్చి చెప్పారు. ఈ వ్యాసం ఈ గ్రంథం యొక్క విలువను పెంచుతుందని చెప్పవచ్చు.

ఈ సందర్భంగా – నాకు చరిత్ర పరిశోధన పట్ల ఆసక్తిని కలిగించిన – ఆం.ప్ర. హిస్టరీ కాంగ్రెస్ వ్యవస్థాపకులు డా॥ యం.పట్టాభిరామరెడ్డి గారికి, సాహితీవేత్త, ప్రముఖ చరిత్రకారులు శ్రీ నేలనూతల శ్రీకృష్ణమూర్తి గారికి ఆజన్మాంతం ఋణపడి ఉన్నాను.

జై విజ్ఞాన్


*డా॥ జి. వెంకటేశ్వర్రావ్*

ఆం.ప్ర. హిస్టరీ కాంగ్రెస్ వ్యవస్థాపక సభ్యులు,

హిస్టరీ కాంగ్రెస్ పూర్వ ప్రధాన కార్యదర్శి,

పూర్వ ఉపాధ్యక్షులు


నెల్లూరు

28-03-2009

ఉగాది విరోధి – నామ సంవత్సరం

విషయసూచిక

# కొమర్రాజు లక్ష్మణరావు

శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు జన్మించేనాటికి 19వ శతాబ్దంలో మూడు పాదాలు గడిచాయి. శ్రీ కందుకూరు వీరేశలింగం సాగించిన సాంఘిక సాహిత్యోద్యమాలు అప్పుడప్పుడే ప్రారంభమవుతున్నాయి. మేధావులలో ఆంగ్ల విద్యాభ్యాసం వల్ల కలిగిన సంస్కార దృక్పథం ఒక పరిణామదశకు చేరింది. అప్పటికే భారతదేశంలో నవీనయుగంలో ప్రధానమైన మూడు ఉద్యమాలు - బ్రహ్మసమాజ, ఆర్యసమాజ, దివ్యజ్ఞాన సమాజాల - ప్రభావం విద్యావంతులపైన ప్రసరించింది. ఈ మూడు ఉద్యమాలు కూడా సంఘ సంస్కార సాంస్కృతిక పునరుజ్జీవన రంగాలలో ఆంధ్రదేశంలో గణనీయమైన ఫలితాలు ప్రసరింపజేశాయి. 19వ శతాబ్దం ముగిసే నాటికి 23 సంవత్సరాల నవయువకుడైన లక్ష్మణరావు ఈ ఉద్యమాల త్రివేణీ సంగమమని భావించవచ్చు.

## నేపథ్యం

శ్రీ వీరేశలింగం సాహిత్యంలో అనేక నూతన ప్రక్రియలకు ప్రవర్తకులయినప్పటికిని ఆధునిక దృష్టితో చరిత్ర రచన, పరిశోధన, శాస్త్రీయ విజ్ఞాన ప్రచారం మొదలయిన వాటిని ఉద్యమం వలె సాగించిన వారు శ్రీ లక్ష్మణరావు. సాహిత్యంలోను, సంఘసంస్కరణలో జాతీయతా దృక్పథం లక్ష్మణరావుతోనే తెలుగుదేశంలో ప్రారంభమయిందనవచ్చు. వీరేశలింగంది విమర్శన దృక్పథమైతే, లక్ష్మణరావుది విశ్లేషణ దృక్పథం. ఆయన శిథిలమవుతున్న వ్యవస్థను పడగొట్టారు; ఈయన దాన్ని సంస్కరించి పునర్నిర్మాణానికి నడుం కట్టారు. స్వీయాభిప్రాయాలు రూపుదీర్చుకుంటున్న వయసులో ఈయన మహారాష్ట్ర దేశంలో నివసించడం మహారాష్ట్రమే కాక, ఇతర భారతీయ భాషలతోను, వ్యక్తులతోను కలిగిన పరిచితి - ఈయన దృక్పథాన్ని, ఆలోచనాసరళిని విశాలం చేశాయి. 19వ శతాబ్దిలోని సాంస్కృతిక సాంఘిక పునరుజ్జీవనోద్యమాల మేలిమిని 20వ శతాబ్దానికి పదిలంగా అందించి, తెలుగుదేశంలో అనేక రంగాలలో పునర్నిర్మాణోద్యమాలకు పునాదులు వేసినవారు ఈయన. ఈ ఉద్యమాలు జనంలో ముఖ్యంగా విద్యావంతులలో ఆత్మవిస్మృతిని తొలగించి, స్వాతంత్ర్య సంపాదనకు వారిని ఉన్ముఖులను చేశాయి.

లక్ష్మణరావు జన్మించడానికి మూడు దశాబ్దాల పూర్వమే ఆధునిక విద్యావిజ్ఞానాలు, వార్తా సాహిత్య పత్రికలు, గ్రంథ ప్రచురణలు, ప్రజల సమిష్టి కృషి, నిర్మాణాత్మకమైన ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. దీనివల్ల ప్రజలలో నూతన జాగృతి ఏర్పడింది. కనుక లక్ష్మణరావు కృషికి కొంత సౌలభ్యం, కొంత ప్రోత్సాహం అతర్కితంగానే సమకూడినవి.

## జననం - విద్యాభ్యాసం

ఈ పరిస్థితిలో శ్రీ లక్ష్మణరావు 18వ తేదీ మే నెల 1877న కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పెనుగంచిప్రోలులో జన్మించారు. తల్లిగారి పేరు గంగమ్మగారు, తండ్రిగారిపేరు వేంకటప్పయ్యగారు. ఈ వంశానికి మూలపురుషుడు కొమర్రాజు. ఈయన 16వ శతాబ్దివాడు. యీయన మునిమనుమడు వేంకట నారాయణ 1740లో శైవమతదీక్షను స్వీకరించారు. అప్పుడు ఆయన తన పేరును శంకరుడుగా మార్చుకొన్నాడట. ఆనాటి నుంచి ఈ వంశంవారు ఆరాధ్య శైవ సంప్రదాయం అనుసరిస్తూ వచ్చారట. ఇంటిపేరు మూలపురుషుడైన కొమర్రాజుతో ఏర్పడింది. మూలపురుషుడైన కొమర్రాజుకు పదకొండవ తరంవాడైన లక్ష్మణరావుకు ఆసఫ్‌జాహీ నాల్గవ నిజాంకు దివానయిన చందూలాల్ దేశపాండ్యా పదవి ఇచ్చాడు. ఈయన చింతపల్లి సంస్థానాధీశుడైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయనికి సౌజన్యం నెరపేవారట. ఈయన సోదరుడు నాగేశ్వరరావు ఆ రోజులలో భవన నిర్మాణ కుశలుడుగా పేరు ప్రతిష్ఠలు సంపాదించి వెంకటాద్రినాయని మన్ననలు పొందినట్టు కూడా చెబుతారు. లక్ష్మణరావు కుమారుడు వెంకటప్పయ్య. ఈయన మునగాల పరగణా దివానుగా ఉండేవాడు. ఈయన కుమారుడు వేంకట లక్ష్మణరావు.

వేంకట లక్ష్మణరావు రెండేళ్ల వయస్సు వాడయివుండగా తండ్రి మరణించాడు. లక్ష్మణరావుకు సవతిసోదరుడు ఒకడు వుండేవారు. ఆయన పేరు శంకరరావు. అప్పుడాయన భువనగిరిలో ఉద్యోగం చేస్తుండేవాడు. వెంకటప్పయ్య మరణంతో సవతి తమ్ముడిని, చెల్లెలిని, సవతితల్లి గంగమ్మను శంకరరావు పోషించవలసి వచ్చింది. లక్ష్మణరావు భువనగిరిలోనే ప్రాథమిక విద్యతోపాటు అన్న వద్ద సంస్కృతం, తెలుగు నేర్చుకున్నారు. ఆ రోజులలోనే లక్ష్మణరావు సోదరి అచ్చమాంబకు భండారు మాధవరావుతో వివాహం జరిగింది. ఈయన లక్ష్మణరావు మాతలుడే. ఈయన నాగపూరులో ఇంజనీరుగా పనిచేసేవాడు. ఈయన మొదటి భార్య మరణించగా, మేనకోడలు అచ్చమాంబని వివాహం చేసుకొన్నాడు. అందువలన లక్ష్మణరావు మాధవరావు ప్రాపకంలో మాధ్యమిక, ఉన్నత విద్యాభ్యాసం నాగపూర్‌లోనే కొనసాగింది. మాతృభాషలో వలెనే మహారాష్ట్రంలోను ఆయన ప్రావీణ్యం సంపాదించాడు. నాగపూర్‌లోని మారిస్‌కాలేజి నుండి ఆయన పట్టభద్రుడయినాడు. మారిస్ ఆనాటి మధ్య పరగణాలకు చీఫ్ కమిషనర్ (గవర్నరు)గా వుండేవాడు. ఆయన పేరుతోనే ఈ కళాశాలను స్థాపించారు. తర్వాత ఇది నాగపూర్ మహా విద్యాలయంగా రూపొందింది. దీనికి అనుబంధంగా ఆ రోజులలో నెయిల్ సిటీ హైస్కూల్ పనిచేస్తోండేది. ఈ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయుడు హరిమహాదేవ పండిట్. ఈయన గొప్ప విద్వాంసుడు. సంస్కరణ భావాలున్నవాడు. 'వివిధ జ్ఞానవిస్తార్' అనే గొప్ప మరాఠీ పత్రికను నిర్వహించేవాడు. లక్ష్మణరావు ఉన్నత పాఠశాల తరగతులలో ఈయనకు

ప్రియ శిష్యుడు. ఈ గురుశిష్యుల అనుబంధం ఎంతగా రాణించిందంటే 'వివిధ జ్ఞానవిస్తార్'లో లక్ష్మణరావు రచనలు చేయడమే కాక దాని ఉపసంపాదకుని బాధ్యత నిర్వహించే వరకు సాగింది. ఆ రోజులలోనే తెలుగు సాహిత్యాన్ని గురించి ఈ పత్రికలో మంచి వ్యాసమొకటి వ్రాశాడు. మరాఠీ సాహిత్య ప్రియులంతా దానిని మెచ్చుకున్నారు. తెలుగు సాహిత్యం లోను ఈయన రచన ఆ రోజులనుండే కొనసాగింది. తెలుగు జనానా పత్రికలో విశ్వము యొక్క విరాట్ స్వరూపం, విశ్వము యొక్క బాహ్య స్వరూపములను గూర్చి సంభాషణరీతిలో వ్యాసాలు ప్రకటించారు.

మారిస్ కళాశాల నుంచి గణనీయంగా బి.ఏ. ఆనర్స్ పట్టం పొంది అటు పిమ్మట కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ప్రైవేటు అభ్యర్థిగా ఎం.ఏ. పట్టం పొందారు. సంస్కృత సాహిత్యం, వేదాంతం అభిమాన విషయాలుగా ఈయన విద్యావ్యాసంగం సాగింది. సంస్కృతం ఎం.ఏ. పరీక్షలో సమాధానపత్రాలు సంస్కృతభాషలోనే వ్రాయవలసి వుండేది. దీనికి తోడు పాళీ భాష కూడ నిర్బంధ పఠనీయంగా ఉండేది. ఒక వైపున ఈయన డిగ్రీల కోసం కృషి చేస్తూనే, మరొక వైపున ఆనాటి మరాఠీ సాహిత్యరంగంలో సంచలనాత్మకమైన వాద వివాదాలలో పాల్గొంటూ ఉండేవారు. రామాయణంలోని పంచవటీ స్థల నిర్ణయాన్ని గురించి గొప్ప పండితులతో తర్క వితర్కాలు జరిపి సప్రమాణంగా భద్రాచలం సమీపంలోని పర్ణశాల ప్రాంతమే పంచవటి అని నిరూపించారు. మహారాష్ట్రలోని మోరోపంత్ విరచితమైన కర్ణపర్వాన్ని పరిష్కరించి ప్రకటించడం మహారాష్ట్ర విద్వత్ప్రపంచంలోను ఆయనకు గొప్ప గుర్తింపును కలిగించింది. నాగపూర్‌లో ఉంటూ ఉండగానే సోదరి అచ్చమాంబకు తెలుగు సాహిత్యంలో అభిరుచి కలిగించి ఆమె చేత రచనలు చేయిస్తుండేవారు. తల్లి గంగమ్మ ప్రోత్సాహం వల్ల విద్యార్థిదశలోనే కృష్ణాజిల్లాలోని స్వస్థలాన్ని దర్శిస్తూ అక్కడి పరిస్థితులను ఆకళింపు చేసుకొంటూ ఉండేవారు. ఈ సందర్భంగా 1897, 98, 99 వేసవి సెలవులలో లక్ష్మణరావు మునగాల సంస్థానపు సమస్యలను తెలుసుకోవడానికి బందరులో ఉండేవాడు. అప్పుడు కోర్ ఆఫ్ వార్డ్ సంరక్షణలో విద్యాభ్యాసం నిమిత్తం బందరులో ఉంటూ వచ్చిన మునగాల యువరాజా నాయని వెంకటరంగారావుతో ఆయనకు పరిచయం కలిగి క్రమేపీ అది వారిద్దరి మధ్య దృఢమైన అనుబంధంగా ఏర్పడింది.

ఈ శతాబ్దం ప్రారంభకాలంలోనే మునగాల సంస్థానాన్ని కోర్ ఆఫ్ వార్డ్ నుంచి మేజరయిన నాయని వెంకట రంగారావుకు అప్పగించడం జరిగింది. అప్పుడు లక్ష్మణరావు తన కార్యక్షేత్రం ఆంధ్రదేశానికి మార్చడం జరిగింది. అప్పటికే ఆయన 'శివాజీచరిత్ర' రచించి పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. తెలుగుదేశంలోని మేధావులందరికీ అభిమాన పాత్రుడయ్యాడు; విద్యాధికుల హృదయ క్షేత్రాలలో జాతీయ భావాల నారులు పోశాడు. 1901 లోనే నాయని

వెంకట రంగారావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాధరావు మొదలయిన మిత్రుల సహకార ప్రోత్సాహాలతో శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయం స్థాపించారు. అప్పుడప్పుడే తెలుగుదేశంలో తల ఎత్తుతున్న జాతీయోద్యమ భావాలను జాగృతం చేయడానికి నడుం కట్టాడు. మహారాష్ట్రలో విద్యాభ్యాసం, కలకత్తా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ. పట్టం పొందడం ఈయన జాతీయభావాన్ని విస్తృతం చేసాయి. ఆ సంస్కారాన్ని సాహిత్యం ద్వారా తెలుగుదేశంలో వ్యాపింపజేయడానికి పూనుకున్నాడు.

## సంఘసేవా జీవితం

లక్ష్మణరావు బెజవాడ తాలుకా కంకిపాడు కరణమైన కానూరు మల్లికార్జునరావు కుమార్తెను పెండ్లాడినాడు. ఆమె పేరు కోటమాంబ. ఈయనకు కోటమాంబయందు అచ్చమాంబ, వినాయకరావు అనే ఇద్దరు సంతానం. అచ్చమాంబ డాక్టరుగాను, సంఘ సేవకురాలుగాను ప్రసిద్ధి పొందింది. వినాయకరావు కూడా ముద్రణాలయం నిర్వహించి కొన్ని రచనలు చేశారు. లక్ష్మణరావు మునగాల రాజాకు దివానుగా నడిగూడెంలో ఉంటూ సంస్థాన వ్యవహారాలు చూచేవాడు. కాని ఇంతలో మునగాల ఎస్టేటును గురించి దావాలు ప్రారంభమయ్యాయి. ఈ సందర్భంగా లక్ష్మణరావు బందరులోను, మద్రాసులోను కోర్టు వ్యవహారాల కోసం చాల కాలం గడపవలసి వచ్చేది. అదిగాక నడిగూడెంలో ఎండలు చాల ఎక్కువ. ఆ వాతావరణం మొదటి నుండి సున్నితమైన లక్ష్మణరావుకు పడలేదు. ఎట్లాగూ కోర్టు వ్యవహారాలలో తిరుగుతుండడం తప్పనిసరి కాబట్టి మునగాల రాజాగారు ఆయనను మద్రాసులోనే వుండి ఆ విషయాలు చక్కపెట్టవలసిందిగా కోరారు. లక్ష్మణరావుకు ఇది చాల అనుకూలించింది. 1905 ఆరంభము లోనే ఆయన సకుటుంబంగా చెన్నపట్నం చేరి అక్కడ కాపురం పెట్టారు. మద్రాసులో ఉండగా ఆయన దక్షిణ భారత సంఘ సంస్కరణ సమాజంలో సభ్యుడుగా చేరాడు, అప్పుడు దాని అధ్యక్షుడు ఎస్.శ్రీనివాస అయ్యంగారు.

ఆ రోజులలో ఈ సమాజం వారు హరిజనులకు విద్య గరపడానికి రాత్రి పాఠశాలలు నిర్వహించేవారు. ఈ కృషిలో లక్ష్మణరావు భాగస్వామి అయి, రాత్రి పాఠశాలలో కూడ పనిచేశారు. ఒక ప్రక్కన కోర్టు వ్యాజ్యాలు చూసుకుంటూనే, న్యాయ వ్యవహారాలలో మరింత పరిజ్ఞానాన్ని గడించుకొనడానికి ఆయన న్యాయకళాశాలలో చేరారు. ఎఫ్.ఎల్. చదివి ఉత్తీర్ణుడయినాడు. అప్పుడే ఆయన దృష్టి సంఘ సంస్కరణల వైపు, రాజకీయాందోళనల వైపు బాగా ఆకృష్టమైంది. ఆనాడు చెన్నపురిలో డాక్టరు సి.బి. రామారావు ఇల్లు సంఘ సంస్కరణాభిమానుల సమావేశ స్థలిగా వుండేది. లక్ష్మణరావు తరచు ఆయన ఇంటికి వెళ్ళుతూ, అక్కడి కార్యక్రమాలలో పాల్గొంటూ వుండేవాడు. మొట్టమొదటిసారిగా ఆయనకు శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావుతో పరిచయం రామారావు ఇంట్లోనే కలిగింది. ఆధునిక భారతదేశ చరిత్రలోనే మలుపు తిప్పిన

వంగదేశ విభజన నవయువకులైన హరిసర్వోత్తమరావు - లక్ష్మణరావు వంటి వారిని బాగా ఉద్రేకపూరితులను చేసింది. అందువల్లనే బహుశా లక్ష్మణరావు న్యాయ కళాశాలలో విద్యను పూర్తిచేసి బి.యల్. పట్టా పుచ్చుకోలేక పోయాడు. ఇంతలో వంగదేశము నుంచి జాతీయోద్యమ మహా తరంగమైన బిపిన్ చంద్రపాల్ తెలుగుదేశంలో పర్యటించడానికి వచ్చారు. రాజ మహేంద్రవరం, విజయవాడ, బందరు వంటి తెలుగు నగరాలలో మహోపన్యాసాలు చేశారు. మునగాల రాజా రాజమహేంద్రవరం దాకా బిపిన్ చంద్రపాల్ ఎదుర్కోలు సన్నాహం చేసి, ఆయనను విజయవాడకు తీసుకొని వచ్చారు. మునగాల రాజా, దివాను కూడ జాతీయవాదులు కావడం కరకవరణ న్యాయంగా శోభించింది.

బిపిన్ చంద్రపాల్ 1905లో మద్రాసుకు వచ్చినప్పుడు, ఆయన సభ ఏర్పాటు చేయడంలో లక్ష్మణరావు, అయ్యదేవర కాళేశ్వరరావు చాల కృషి చేశారు. అదే సంవత్సరం వంగదేశ యువకులను అభినందించడానికై దీపావళి పండుగ నిధిని సేకరించడానికి వీరిద్దరూ పూనుకున్నారు. లక్ష్మణరావు తన వంతుగా పగడాల వీధిని నిర్ణయించుకొని ఇంటింటికి తిరిగి నిధి వసూలు చేశారు. మహాలయ అమావాస్య నుండి దీపావళి వరకు నెలరోజుల పాటు ఇంటింటికి తిరిగి స్వదేశ ఉద్యమాన్ని, దీక్షను బోధించే కరపత్రాలు పంచి పెడుతూ వసూలుచేశారు. దీపావళి పండుగనాడు ఆ డబ్బునంతా 'స్వదేశ మిత్రన్' సంపాదకులు శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్ సమక్షంలో లెక్కపెట్టగా 52 వేల రూపాలయు లెక్క తేలింది. న్యాపతి సుబ్బారావు పంతులు, సర్ సైయద్ మహమ్మద్ ధర్మకర్తలుగా స్వదేశీ వస్తువిక్రయశాల నొకదానిని ఈ ధనంతో చెన్నపట్టణంలో నెలకొల్పడం జరిగింది.

1907లో కృష్ణాజిల్లా రాజకీయసభలు, సంఘ సంస్కరణ మహాసభలు జరిగినవి. సంఘ సంస్కరణ సభల నిర్వాహక కార్యదర్శి లక్ష్మణరావు. ఆహ్వాన సంఘాధ్యక్షుడు మునగాల రాజా, ఈయన తన ప్రారంభోపన్యాసంలో "స్వభాష, స్వవేషము, స్వదేశీ, స్వరాజ్యము ఆధునిక కాలపు నాలుగు వేదములు" అని ఉత్తేజకరంగా వర్ణించాడు. నాయని వెంకట రంగారావు స్వదేశీ అభిమానానికి కారకుడు లక్ష్మణరావే అని చెప్పవచ్చు.

స్వస్థలంలో రాజకీయచైతన్యం, సంఘ సంస్కరణల ప్రయత్నాలు చేస్తూనే రాజధాని నగరంలో పెద్ద యెత్తున విద్యాధికులను సమీకరించి నిర్మాణాత్మకమైన మహత్తరకృషికి లక్ష్మణరావు సంకల్పించాడు. ఆ రోజులలో యువ విద్యాధికులందరూ తీవ్రమైన జాతీయాభిమానంతో ఉప్పొంగిపోతుండేవాడు. జపాన్ వారి జాతీయ చైతన్యం, స్వదేశాభిమానం, స్వయంకృషి, స్వశక్తిపై విశ్వాసం మన యువకులను ఎంతగానో ఆకర్షించాయి. జపాను దేశానికి వెళ్ళి లఘుపరిశ్రమలు స్థాపించడానికి కావలసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని పొంది, స్వదేశానికి వచ్చి జాతీయ పరిశ్రమలను స్థాపించవలెనని దేశాభిమానులు ఉవ్విళ్లూరేవారు. ఇటువంటి యువ

విద్యాధికుడు శ్యాంరాజ్ రామారావు. ఈయన రాయలసీమ ప్రాంతంవారు. ఈయనకు జపాన్‌కు వెళ్ళి గాజు పరిశ్రమలో సాంకేతిక విజ్ఞానం సంపాదించాలనే అభిలాష ఉండేది. ఈయనకు ఆర్థికంగా సాయపడేందుకు మిత్రులందరు డాక్టర్ సి.బి.రామారావు ఇంట్లో సమావేశమయ్యారు. ఆయనకొక అభినందనపత్రం కూడ సమర్పించారు. ఆ సమయంలోనే మిత్రుల మనస్సుల్లో విజ్ఞానచంద్రికా మండలి స్థాపనకు అంకురార్పణం జరిగింది. ఏ విధంగా జాతీయ ప్రబోధం చేయాలో తర్కించుకొన్నారు. పత్రిక నడపడమా, గ్రంథ ప్రచురణమా - అని చర్చలు జరిగాయి. చివరకు చందాదారులను చేర్చి, ప్రతి మూడునెలలకు ఒక పుస్తకం చొప్పున అన్ని విధాలా ఉన్నత ప్రమాణాలతో పుస్తకాలు ప్రచురించాలని నిశ్చయించుకొన్నారు. అయితే పద్యకావ్యాలు కాక, సరళమైన, సలక్షణమైన వచనంలో విజ్ఞానశాస్త్రం, స్వాతంత్ర్యోద్యమ చరిత్రలు, దేశచరిత్రలు మొదలైనవి ప్రచురించ సంకల్పించారు. ఈ విజ్ఞాన చంద్రికా గ్రంథమండలికి లక్ష్మణరావు సంపాదకుడు. నాయని వెంకటరంగారావు పోషకుడు. డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, అయ్యదేవర కాళేశ్వరరావు, రావిచెట్టు రంగారావు క్రియాశీల సభ్యులుగా ఉండేవారు. అయితే విజ్ఞానచంద్రికా గ్రంథమండలి 1906 నుంచి గాని పనిచేయడం సంభవించలేదు. హైదరాబాద్ రెసిడెన్సీ బజారులో దీని కార్యాలయ స్థాపన జరిగింది. హరి సర్వోత్తమరావు కార్యదర్శి.

## విజ్ఞాన చంద్రికా మండలి

1906 వేసవిలో మద్రాసులోని మునగాల రాజాగారి నివాస భవనంలో లక్ష్మణరావు, హరిసర్వోత్తమరావు, రావిచెట్టు రంగారావు అయ్యదేవర కాళేశ్వరరావు సమావేశమై విజ్ఞాన చంద్రికామండలి రూపురేఖలను నిర్ణయించారు. ఆ సమావేశంలో లక్ష్మణరావు సమకాలీన భారతీయ సాహిత్యంలోని ఆధునిక రీతులను గూర్చి వివరించారు. ముఖ్యంగా మహారాష్ట్ర, బెంగాలీ, హిందీ భాషలలోని నవీన రీతులను గురించి విపులీకరించి తెలుగుదేశంలో చేయవలసిన కృషిని గూర్చి చర్చించారు. భారతదేశంలో ప్రతి భారతీయుని కర్తవ్యం స్వాతంత్ర్య సంపాదననుకొని, అందుకై తెలుగు ప్రజలను కూడ సమాయత్తం చేయడానికి వారిలో చైతన్యం కలిగించవలెనని, అందుకుగాను సరళమైన భాషలో వివిధ విషయాలలో గ్రంథాలు వెలువరించాలని, ముఖ్యంగా స్త్రీ విద్య, అస్పృశ్యతా నివారణం మొదలయిన సాంఘిక సమస్యలతో పాటుగా, రాజకీయార్థిక విజ్ఞానాలను కూడ అందజేయవలెనని లక్ష్మణరావు సూచించాడు. దీనికోసం తెలుగుదేశం నాలుగు మూలల నుండి చందాదారులను చేర్చాలని, చందాదారులకు నూరుపుటలు నాలుగణాల చొప్పున, చందాదార్లు కాని వారికి పోస్టేజి ఖర్చులు కాక నూరు పుటలకు ఆరణాల చొప్పున గ్రంథాలు విక్రయించాలని నిశ్చయించారు. విజ్ఞాన చంద్రికా మండలి సభ్యులెవరును జాతీయ విజ్ఞానోద్యమంలో కృషి చేయడానికి

ప్రతిఫలం ఆపేక్షించరాదని దృఢనిశ్చయం చేసుకొన్నారు. దీనికనుగుణంగా లక్ష్మణరావు తాను వ్రాసిన ఏ గ్రంథానికి ప్రతిఫలం తీసుకోలేదు.

వీరు రచనా, గ్రంథ ప్రచురణ యజ్ఞంలో గ్రాంథిక వ్యావహారిక వాదవివాదాల జోలికి పోలేదు. సర్వజన సులభగ్రాహ్యమైన సరళ గ్రాంథిక శైలినే లక్ష్యంగా పెట్టుకొన్నారు. కార్యస్థానం ఏర్పడి పని చేయడానికిగాను ప్రారంభవ్యయం నిమిత్తం మునగాల రాజా రెండు వేల రూపాయలు విరాళమిచ్చారు. విజ్ఞానచంద్రికామండలి పక్షాన ప్రచురితమైన మొట్టమొదటి గ్రంథం హరి సర్వోత్తమరావు వ్రాసిన అబ్రహాంలింకన్ జీవితచరిత్ర. ఈ జీవితచరిత్ర రచించడంలోనే గ్రంథమండలి ఆశయం స్పష్టమవుతుంది. పేదరికంలో పుట్టి స్వయంకృషి వల్ల గొప్ప విద్యావంతుడై రాజకీయనాయకుడై, దేశనేత అయి, అమెరికా అధ్యక్షుని చేత సన్మానం పొంది బానిస వ్యాపారాన్ని రద్దుచేసిన అబ్రహాం లింకన్ పీడిత చరిత్రను హరిసర్వోత్తమరావు ఉత్తేజకరంగా వ్రాశాడు. ఈ పుస్తకాన్ని ఆవిష్కరించిన సందర్భంలో మండలి సభ్యులు ఐదుగురు సకలాంధ్ర జనావళిని ఉద్దేశించి ఒక విజ్ఞాపనం ప్రచురించారు. దీనిలో వారు మండలి ఆశయాలు వివరించారు. విద్యావంతుల రచనలను, లక్ష్మీపుత్రుల ధనసహాయాన్ని అర్థించారు. విజ్ఞానశాస్త్రాలలో పట్టభద్రులైన వారు శాస్త్రీయ విషయాలను తెలుగులో వ్రాసి సహకరించాలని కోరారు. రచయితలు శాస్త్రీయ గ్రంథరచనలో కాశీనాగరీ ప్రచారిణీ సభవారు రూపొందించిన పారిభాషిక పదజాలాన్ని ఉపయోగించవలసిందిగా కోరారు. దీనిని బట్టి మండలికి భావిభారత సమైక్యదృష్టి ఎంత తీక్షణంగా వుండేదో స్పష్టమవుతుంది.

విజ్ఞానచంద్రికాగ్రంథమండలి ప్రచురించిన రెండవ పుస్తకం లక్ష్మణరావు వ్రాసిన 'హిందూ మహాయుగము'. భారతదేశ చరిత్రను ప్రధానమైన నాలుగు మహాయుగాలుగా విభజించి తెలుగువారికి అందించాలని లక్ష్మణరావు సంకల్పం. ఈ గ్రంథాన్ని గురించి సమకాలీన పత్రిక "ఆంధ్రకేసరి" ఈ విధంగా శ్లాఘించాడు : "ప్రాచీన హిందువుల యొక్క ఔన్నత్యమును తెలిపెడి ఇట్టి చరిత్ర మిదివరకు నాంధ్ర భాషలో నెవ్వరును రచియించియుండలేదు. శైలి మిక్కిలి మృదువై లక్షణయుక్తమై యున్నది." ఈ పుస్తకం అచ్చయిన ఐదు నెలలలోనే వెయ్యి ప్రతులు అమ్ముడుపోయాయట. రెండు నెలలలోనే అయిదు వందలు అమ్ముడుపోయాయట. ఇది నాటికీ నేటికీ కూడా ఆశ్చర్యకరమైన విషయమే. 1901లో మొదటిసారి ముద్రణ పొందగా 1909లో మెట్రిక్యులేషన్ పాఠ్యగ్రంథంగా నిర్ణీతమయింది. 1892లో నాగపూర్‌లో జరిగిన అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించిన రాజకీయనాయకుడు పనప్పాకం ఆనందచార్యులుగారు ఈ గ్రంథాన్ని చాల శ్లాఘించారు. ఇలాంటి గ్రంథం రచించిన లక్ష్మణరావు స్వదేశీయుడయినందుకు

తాము గర్విస్తున్నామని కూడా ఆయన అన్నారు. పాశ్చాత్యులు పక్షపాత దృష్టితో వ్రాసి నిరూపించే మహత్ర్పయత్నం ఈ గ్రంథంలో జరిగింది. అపూర్వ చరిత్రాధారాలు సేకరించి మౌలికంగా రచన సాగించాడు గ్రంథకర్త.

దీని తరువాత వెలువడిన గ్రంథం డాక్టర్ ఆచంట లక్ష్మీపతి జీవశాస్త్రము. నాలుగవ పుస్తకం వేలాల సుబ్బారావు "రాణిసంయుక్త". విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ఏర్పరచుకొన్న ఆశయాలకు అనుగుణంగానే ఒకటొకటిగా మహాపురుషుల చరిత్ర, దేశచరిత్ర, విజ్ఞానశాస్త్రం, చారిత్రక నవల ఈ నాలుగు పుస్తకాలు హైద్రాబాదునుండే వెలువడినవి. పుస్తకాలు వెలువడిన కొద్దీ చందాదారుల సంఖ్య ఎక్కువవుతూ వచ్చింది.

1907వ సంవత్సరంలో రాజద్రోహం నేరం క్రింద హరిసర్వోత్తమరావు నిర్బంధితుడు కావడంతో మండలి కార్యకలాపాలకు కొంత అంతరాయం ఏర్పడింది. హైదరాబాదులో కూడా మండలి కార్యస్థానంపైన పోలీసుల నిఘా ఎక్కువయింది. అప్పుడు కార్యస్థానాన్ని మద్రాసుకు మార్చవలసి వచ్చింది. హరిసర్వోత్తమరావు స్థానంలో ఆచంట లక్ష్మీపతి కార్యదర్శిగా నియమితుడయ్యాడు. ఆదిరాజు వీరభద్రరావును లక్ష్మీపతికి సహాయకుడుగా మద్రాసులో వుండి పనిచేయడానికి నియమించారు. అందువల్ల ఐదవ పుస్తకం మద్రాసు నుంచి వెలువడింది. ఇది మహమ్మదీయ మహాయుగం. లక్ష్మణరావే ఇందులోని క్రొత్త విషయాలు అంటూ ఈ విధంగా పేర్కొన్నారు : 1. మహమ్మద్ ఘజనీని అనంగపాలుడు ఓడించడం 2. మహమ్మద్ ఘోరీని పృథ్వీరాజు ఏడుసార్లు పట్టుకొని ప్రాణదానం చేయడం. 3. స్థానేశ్వర యుద్ధములో జరిగిన మోసం 4. ఔరంగజేబును ఐదుసార్లు ఓడించి స్వతంత్రుడైన ఛత్రసాల్‌రాజు వృత్తాంతం 5. అక్కన్న-మాదన్నగార్ల చరిత్ర 6. అక్బరును ఓడించిన రాణి దుర్గావతి చరిత్ర-ఇవి ప్రముఖమైన అంశాలు. ఇవికాక నూతనాంశాలు చాలా ప్రతిపాదించడం జరిగింది. ఆంగ్ల చరిత్రకారుల రచనలతోబాటుగా సంస్కృత, మరాఠీ, హిందీ, తెలుగు భాషలలోని చరిత్రలన్నింటిని సమన్వయ పూర్వకముగా అవలోకనం చేసి ప్రామాణికంగా ఈ గ్రంథరచన చేయడం జరిగింది. ఈ గ్రంథంలోనే ఆరవ ప్రకరణమైన విజయనగర చరిత్రను ఎన్నెన్నో మౌలికాంశాలతో, పెక్కు చారిత్రకాధారాల పరిశీలనతో అపూర్వమైన రీతిలో రచించాడు. బహుభాషలలో లక్ష్మణరావుకు గల పాండిత్యం ఆయన పెక్కు మౌలికాంశాలను సేకరించడానికి తోడ్పడింది.

మండలి పక్షాన వెలువడిన ఆరవగ్రంథం పదార్థ విజ్ఞానశాస్త్రం. దీనిని మంత్రి ప్రగడ సాంబశివరావు రచించాడు. ఏడవ గ్రంథం వేమనాది విశ్వనాథ శర్మ రసాయనశాస్త్రం. గ్రంథమండలి పక్షాన వెలువడిన ఈ విజ్ఞానశాస్త్ర గ్రంథాలు చాలా ప్రఖ్యాతి పొందాయి. అంతకు పూర్వం విజ్ఞాన శాస్త్ర రచనతో వీరేశలింగం మొదలయినవారు కొన్ని ప్రయత్నాలు జరిపినా ఆ శాస్త్రాలు చదివినవారు వాటిని సరళమైన శైలిలో వ్రాయడానికిది తొలి ప్రయత్నం. ఎనిమిదవ

గ్రంథం ఆ రోజులలో చాలా ప్రచార ప్రసిద్ధులు పొందిన చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రుల చరిత్ర. తొమ్మిదవ గ్రంథం భోగరాజు నారాయణమూర్తి రచించిన "విమలాదేవి". పది నుంచి పదిహేను వరకు ప్రకృతిశాస్త్ర గ్రంథాలు, మండలి పక్షాన మొత్తం పదమూడు ప్రకృతిశాస్త్ర గ్రంథాలు వెలువడినవి. ఆయా శాస్త్రాలలో ప్రజ్ఞావంతులైన వారే ఈ శాస్త్రగ్రంథాలు రచించారు. 1916వ సంవత్సరం వరకు ఈ మండలి చాలా చురుకుగా పనిచేసింది. అంతవరకు 30 గ్రంథాలు ప్రచురించింది. ప్రపంచయుద్ధ మేఘాలు ఆవరించడంతో మండలి కార్యకలాపాలకు అటుతర్వాత కొన్ని విఘ్నాలు కలిగాయి.

ఈ మండలి కార్యకలాపాలలో విశేషించి చెప్పదగినది చారిత్రక నవలా రచనలో పోటీజరపడం తెలుగుదేశంలో ఇదే ప్రథమం. బహుశ దేశంలోనేనేమో! భారతీయ పురావైభవ చరిత్రను, అందులో ఏక దేశమైన తెలుగువారి పరమోజ్జ్వల చరిత్రను కథారూపకంగా అందించి తెలుగువారిని చైతన్యవంతులను చేయడమే ఈ ప్రణాళికలోని ముఖ్యోద్దేశం. స్వాతంత్ర్యం దేశభక్తి స్వస్థాన వేషభాషల పట్ల అనురక్తి, జాతీయతాదృక్పథం తెలుగుప్రజలలో ఉద్దీపింపజేయడానికి లక్ష్మణరావు తలపెట్టిన ఈ ఉద్యమ సత్ఫలితాలు తెలుగుదేశం వారు అచిరకాలంలోనే పొందడం గురించి నిదర్శనాలున్నాయి. బహుశా 1913వ సంవత్సరం నుంచి తీవ్రమైన అభినివేశంతో కొనసాగిన ప్రత్యేకాంధ్రరాష్ట్రోద్యమం విజ్ఞానచంద్రికాగ్రంథమండలి సాధించిన సత్ఫలితాలలో ఒక్కటని చెప్పవచ్చు. ఆ రోజులలోనే చారిత్రక నవలకు 500 రూపాయల ప్రథమ బహుమతి ఇచ్చి ప్రోత్సహించడం అపూర్వ విషయం. ఈ పోటీల వల్లనే ఒక దశలో తెలుగులో గొప్ప చారిత్రక నవలలు వెలువడ్డాయని చెప్పడం సత్యదూరం కాదు. ఆ తర్వాత చారిత్రక నవలారచన పట్ల కుతూహలం కలుగడం. అడివి బాపిరాజు వంటి అగ్రశ్రేణి రచయితలకు ప్రేరణ కలుగడం విజ్ఞానచంద్రికామండలి సాధించిన సత్ఫలితమే అని చెప్పవచ్చు. ఈ పోటీ వెనుక వంగదేశ విభజనవల్ల కలిగిన తీవ్రజాతీయోద్యమ ప్రభావం కూడ వుంది. కేతవరపు వెంకటశాస్త్రి "రాయచూరు యుద్ధం" దుగ్గిరాల రాఘవచంద్రయ్య "విజయనగర సామ్రాజ్యము" ఎ.వి. నర్సింహ్మపంతులు "పాతాళభైరవి" భోగరాజు నారాయణమూర్తి "విమలాదేవి" చాలా ప్రఖ్యాతి పొందినవి. "రాయచూరుయుద్ధం" సాహస వీరశృంగార గాథ. శ్రీకృష్ణదేవరాయల వారు దీనిలో నాయకుడు. తిమ్మరుసు మంత్రి బుద్ధి చాతుర్యము, రాయలవారి పరాక్రమము ఒక ప్రణయగాథతో జోడించి రాయచూరు పతనం ఫలశ్రుతిగా ఈ నవల ఇతివృత్తం వెంకటశాస్త్రి నిర్వచించారు. ఈ నవల పునర్ముద్రణ పొందడం చాలా అవసరం.

ఈ విధంగా గ్రంథప్రచురణ చేయడమే కాక 1912లోనే ఈ మండలి విజ్ఞానచంద్రికా పరిషత్తు అనే పేరుతో వైజ్ఞానిక, చారిత్రక, శాస్త్రీయ గ్రంథాలలో పరీక్షల సంస్థను నెలకొల్పింది. మండలి ప్రచురించినవిగాని, ఇతరులు రచించిన ప్రాశుచిక గ్రంథాలు గాని పఠనీయ

గ్రంథాలుగా నిర్ణయించి తెలుగుదేశములోని పలు ప్రాంతాలను పరీక్షా కేంద్రాలుగా ఈ పరీక్షలు నిర్వహించడం జరిగింది. గుంటూరు, బందరు, బెజవాడ, నర్సాపురం, రాజమహేంద్రవరం, కాకినాడ, హైదరాబాదు మొదలైన ప్రదేశాలలో ఈ కేంద్రాలు నెలకొల్పింది. యువతీయువకు లెందరో అత్యుత్సాహంతో ఈ పరీక్షలలో పాల్గొన్నారు. పరీక్షలలో గణనీయమైన ఫలితాలు సాధించినవారికి 116 రూపాయల నగదు బహుమానం, బంగారు, వెండి పతకాలు, యోగ్యతా పత్రాలు యిచ్చిరి. ఈ విధంగా ఈ పరీక్షలలో పాల్గొని ఆ రోజులలో బహుమానాలు పొందినవారిలో, తర్వాతికాలంలో ప్రసిద్ధిపొందిన పలువురు సాహిత్యవేత్తలున్నారు. కవితిలక కంచనపల్లి కనకమ్మ ఈ పరీక్షలలో ప్రథమబహుమతి పొందారు. సుప్రసిద్ధ సాహిత్య పరిశోధకుడు శ్రీ నిడదవోలు వెంకటరావు బంగారు పతకం పొందారు. పరీక్షాధికారులుగా వీరేశలింగం పంతులు, పనప్పాకం శ్రీనివాసాచార్యులు, కట్టమంచి రామలింగారెడ్డి వంటి గొప్ప సాహిత్యవేత్తలుండడం ఈ పరీక్షల విశిష్టత అని చెప్పవచ్చు. వీటి మూలంగా తెలుగుదేశంలో నవీన సాహిత్య, శాస్త్రీయ విజ్ఞానాల ప్రచారానికి దోహదం కలిగింది.

## ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం

1915లోనే తెలుగులో విజ్ఞాన సర్వస్వాన్ని నిర్మించాలని లక్ష్మణరావుకు సంకల్పం కలిగింది. బహుళ భారతీయ భాషలలో నాటికి ఇటువంటి ప్రయత్నం జరుగకపోగా, ఊహ కూడా కలుగలేదు. లక్ష్మణరావుకు ఈ సంకల్పం కలగడం విశేషం. దాని భారమంతా లక్ష్మణరావే వహించారు. డాక్టర్ కేట్కర్ మహారాష్ట్రం నుంచి వచ్చి లక్ష్మణరావు ఇంట్లో నెలల తరబడి వుంటూ తాను తలపెట్టిన మహారాష్ట్ర విజ్ఞానసర్వస్వం గురించి చర్చలు జరిపేవాడు. డాక్టర్ శ్రీధర్ వెంకటేశ కేపూర్ మహారాష్ట్ర జ్ఞానకోశ నిర్మాణానికి కావలసిన స్ఫూర్తిని లక్ష్మణరావు నుండి పొందినట్లు కేట్కర్‌ను సన్నిహితంగా ఎరిగిన ఎం.బి. నియోగి (ఎం.ఏ., ఎల్.ఎల్., ఎం.ఎల్.ఎల్.డి. ఆనర్స్, కె.టి.సి.ఐ.ఇ.) తెలిపారు. ఈయన వయస్సు 88 సంవత్సరాలు.

1915 తర్వాత లక్ష్మణరావు జీవితకాలమంతా విజ్ఞానసర్వస్వరచనలోనే గడిచిపోయింది. ఈ కాలంలో శాసనాలు చదివించడంలోను, చరిత్ర పరిశోధనలోను ఆయన వద్ద శిక్షణ పొందిన మల్లంపల్లి సోమశేఖర శర్మ ఆయనకు ఎంతగానో సహకరించారు. ఒక్క 'అ' అనే అక్షరంతోనే మూడు సంపుటాలు లక్ష్మణరావు ప్రచురించారు. ఆంధ్ర అనే శీర్షికతో పూర్తిగా ఒక పెద్ద సంపుటి వెలువరించడానికి పూనుకొని విషయసేకరణం చేస్తూ వచ్చారు. విజ్ఞాన సర్వస్వంలో మొత్తం 35 వ్యాసాలు తనవి. 11 వందల పుటలు ఆయన ప్రచురించారు. ఈ వ్యాసాలలో భాష, చరిత్ర, ధర్మశాస్త్రం, గణితం మొదలైన ఎన్నెన్నో విషయాలపై ఆయన వ్రాశారు. ఏమి వ్రాసినా విషయం పరిపూర్ణంగాను, సాధికారంగాను, సప్రమాణంగాను ఉండటం లక్ష్మణరావు

రచనలలో ప్రత్యేకత. అంకగణితం నుంచి అధర్వణ వేదం వరకు ఆ మహనీయుని మేధా ముద్రణ స్పష్టంగా గోచరిస్తూనే వుంటుంది. అచ్చతెలుగును గూర్చి, అభిజ్ఞాన శాకుంతలాన్ని గురించి, అలంకారాలను గురించి లక్ష్మణరావు వ్రాసిన వ్యాసాలలో ఆయన మౌలిక విమర్శనాశక్తి కానవస్తుంది. ఆయన శైలికి మచ్చుతునకగా 'అంకగణితం' వ్యాసంలో ఒక పరిచ్ఛేదం చూపవచ్చు.

"సంఖ్యలను వ్రాయుటలో వివిధ జాతులవారు వివిధ మార్గముల నవలంబించిరి. చరిత్రకారులకు దెలిసినంతవరకు 'పోనీసి' యను పద్ధతి మిక్కిలి పురాతనమైనది. వీరు ఒకటిని ఒక గీతచేతను, రెండును రెండు గీతల చేతను - ఈ ప్రకారము తొమ్మిది వరకును సంఖ్యలను గీతలచే దెలిపెడివారు. ఇట్లు I, III, IIIII గుర్తులు 1, 3, 5 సంఖ్యలకు ప్రత్యామ్నాయముగా నుండెడివి. పది, పదకొండులకు వేరు వేరు గుర్తుల నుపయోగించెడివారు. ఈ రీతిని గీతలతో సంఖ్యలను వ్రాయుట వ్రేళ్ళతో లెక్కించుటను బట్టి స్ఫురించినదనుటకు సందియము లేదు."

## లక్ష్మణరావు ఇతర రచనలు

విజ్ఞానచంద్రికా గ్రంథమండలిలోను, విజ్ఞాన సర్వస్వంలోను ప్రచురించిన రచనలు కాక లక్ష్మణరావు వివిధ పత్రికలలో రచించిన వ్యాసాలు, గ్రంథాలు చాల ఉన్నవి. ఆయన చరిత్రకారుడుగా, సాహిత్యవేత్తగా లబ్ధ ప్రతిష్టుడయినది "శివాజీ చరిత్ర"తో ననవచ్చు. దీనిని రచించడానికి కారణాలను ఆయన ఈ విధంగా తెలిపారు : "పరదేశస్థులచే వ్రాయబడిన ఇంగ్లీషు గ్రంథాలలో లక్ష పొరపాటులుండవచ్చు. చరిత్ర భాగములు కొన్ని తిన్నగా తెలియనందున చరిత్రలో కొంత యుండవచ్చును. కాన మూల మహారాష్ట్ర గ్రంథముల ననుసరించి ఈ చరిత్ర వ్రాయబడినది. ఆయన చిట్నీస్ కృతమైన 'బఖర్', 'శివదిగ్విజయ', 'మహారాష్ట్రదా ఇతిహాస్' మొదలైన గ్రంథముల నుండి శివాజీ చరిత్రను సేకరించారు. 'సరస్వతి' పత్రికాధిపతులు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు 'శివాజీ చరిత్ర'ను ప్రచురించారు. ఇది చాలా ప్రఖ్యాతి పొందింది. ఇప్పటికి నాలుగు ముద్రణలు పొందడం దీని విశేషం.

లక్ష్మణరావు వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసాలు ఆయన మరణానంతరం రెండు సంపుటాలుగా వెలువడినవి. మొదటి సంపుటం 1923లోనే స్మారకసంపుటిగా వెలువడింది. ఇందులో చారిత్రక కాల నిర్ణయానికి, భాషకు వివిధ విజ్ఞానశాస్త్ర విషయాలకు సంబంధించిన వ్యాసాలు ఉన్నవి. ఏకశిలా నగరము ఓరుగల్లే - అనే వ్యాసము, చాళుక్యులు దాక్షిణాత్యులే, కృష్ణరాయల నిదానకాలము మున్నగు వ్యాసాలు ఆయన విజ్ఞాన వైదుష్యాన్ని, విమర్శనాపాటవాన్ని తెలుపుతాయి. భాషావిషయకంగా యుద్ధమల్లుని బెజవాడ శాసనము, ద్రావిడభాషలలో ఉత్తమ పురుషవాచక సర్వనామము, త్రిలింగము నుండి తెలుగు పుట్టెనా లేక తెలుగు నుండి త్రిలింగము పుట్టెనా - అనే వ్యాసాలు వివిధ భాషాపాండిత్యాన్ని, ముఖ్యంగా ద్రావిడభాషలలో ఆయన గంభీర పరిజ్ఞానాన్ని తెలియజేస్తాయి. ఇవిగాక పంచాంగ గణనము, లలితకళలు, కర్మయోగము

గురించి లలితమైన శైలిలో ఆయన వ్రాశారు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ప్రచురించిన పదార్థ విజ్ఞాన రసాయనాది శాస్త్ర గ్రంథాలకు ఆయన వ్రాసిన పీఠికలు ఈ సంపుటిలో ఉన్నవి.

రెండవ సంపుటంలో ఐదు వ్యాసాలున్నవి. ఇందులో నాలుగు విజ్ఞాన సర్వస్వంలో లక్ష్మణరావు వ్రాసినవే. ఇవికాక, శృంగారము – పూర్వలాక్షణికులు అనే వ్యాసం కూడా ఇందులో చేర్చారు.

లక్ష్మణరావు వ్రాసిన కొన్ని గ్రంథాలను సంస్కరించి విపుల పీఠికలు వ్రాసి ప్రచురించారు. అలాటి వాటిలో ఒకటి మల్లికార్జున పండితారాధ్యుడు రచించిన శివతత్త్వసారము. ఆయునకు గ్రంథ పరిష్కరణలోను, సంపాదకత్వం వహించి ప్రచురించడంలోను అచేలమైన ప్రతిభ వుండేది. పుస్తకం అచ్చువేసేటప్పుడు తాను సంపాదించగలిగిన వివరాలన్నీ ఆయన ఇచ్చేవాడు. అటు తర్వాత ఎవరైనా పూనుకొని దానిని ఇంకా నిర్దుష్టంగా ప్రకటించవచ్చునని ఆయన నమ్మకం. పాదనిర్ణయంలో ఆయన పద్ధతి ప్రశంసా పాత్రమయింది. పాఠాంతరాలన్నిటినీ కూడ ఆయన సేకరించి అధన్యుటిలో ఇచ్చేవారు. ఆంధ్ర సాహిత్యపరిషత్తు తరఫున శివతత్త్వసారం పరిష్కరించి ప్రచురించారు. దీనికి గొప్ప విలువైన పీఠికను కూర్చారు. శివతత్త్వసారం నన్నయకు నూరేళ్ళ తర్వాత తిక్కనకు నూరేళ్ళముందు రచితమైందని ఆయన నిర్ణయం. చారిత్రాత్మకమైన విలువ దీనికి చాల కలదని ఆయన నిరూపించారు. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో లభించిన ప్రతికి జతగా మరొక ప్రతిని నర్సాపురంలో ఆయన సంపాదించగలిగాడు. ఈ రెండు ప్రతులను పోల్చి ఆయన మార్పులు, చేర్పులు చేసి ప్రకటించారు. పూర్వ లాక్షణికులు దీనిని శతకమనే వ్యవహరించగా, ఇందులో శివా, రుద్రా, అజా, మహేశా మొదలయిన మకుటాలతో 489 వరకు కంద పద్యాలు ఉన్నట్టుగా పేర్కొన్నారు. పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో పాల్కురికి సోమన ఈ గ్రంథాన్ని గూర్చి ప్రస్తావించాడు. గణపవరపు వేంకట కవి ప్రయోగరత్నాకరం లోను, కస్తూరి రంగకవి రంగరాట్ ఛందంలోను ఈ గ్రంథాన్ని, ఇందులోని 'జయతి త్రిపురాంతకదేవా' అనే పద్యాన్ని దూరాహ్వాన ప్లుతయాతికి ఉదాహరణగా ఇచ్చినట్టు తమకు లభించిన ప్రత్యంతరంలో ఈ పద్యం లేనట్టు ఆయన వివరించాడు. పాఠపరిష్కరణలో వున్న కష్టనిష్ఠురాలను గురించి ఈ పీఠికలో చర్చించాడు. వీరేశలింగం వంటివారు చిత్ర భారతాన్ని పరిష్కరించేటప్పుడు పడిన భ్రమ ప్రమాదాలను ప్రస్తావించి పాఠ నిర్ణయంలో పాటించవలసిన జాగ్రత్తలను చెప్పారు. చిత్రప్రభాను అనే ప్రయోగాన్ని చిత్తాబజభానుడు అని వీరేశలింగం దిద్దివేయడం వలన ఒక తరంవరకు యదార్థ నిరూపణం కష్టమయిపోయింది. పరిష్కరణలో తనకు తోడ్పడిన ప్రతివారికి కృతజ్ఞత తెలియజేయడం ఆయన ఔదార్యానికి, సంస్కారానికి తార్కాణం.

జాతి పునరుజ్జీవనానికి చేయవలసిన కృషిలో ఆయన ఎప్పుడూ పరమోత్సాహంతో పని చేసేవాడు. విజ్ఞాన చంద్రికా మండలి తరఫున ప్రామాణిక గ్రంథ ప్రచురణ కోసం, ఆయా రచయితలను సృష్టించి పరిచయం చేయడం కోసం ఆయన పరిశ్రమించేవారు. క్రొత్తవారిని ప్రోత్సహించడం, అప్పటికే లబ్ధప్రతిష్ఠులైనవారి చేత ఆయా గ్రంథాలను ప్రామాణిక దృష్టితో వెలువరింపచేయడం లక్ష్మణరావు జీవితాశయంగా ఉండేది. గురజాడ అప్పారావుగారి చేత కళింగదేశ చరిత్రను రచియింపజేసి ప్రకటించాలని లక్ష్మణరావు అభిలషించారు. విజ్ఞానచంద్రికా మండలి ప్రచురణంలో రాబోయే గ్రంథాలలో కళింగదేశ చరిత్రను ప్రకటించారు కూడా. 1910వ సంవత్సరంలో విజ్ఞాన చంద్రికామండలి పక్షాన వెలువడిన చిలుకూరి వీరభద్రరావు గారి ఆంధ్రుల చరిత్ర ప్రథమ సంపుటంలో, రాబోయే పుస్తకాల పట్టికలో కళింగదేశ చరిత్ర కూడా వుంది. గురజాడ అప్పారావు గారు కూడా కళింగదేశ చరిత్రకు సంబంధించి అనేక శాసనాలు, స్థానిక పురాణాలు, చారిత్రకాధారాలు సేకరించినట్లున్నూ వింటాము. అయితే నాడు కాని, ఆ తరువాత కాని, ఈ గ్రంథం వెలువడలేదు. దురదృష్టవశాత్తు 1910వ సంవత్సర ప్రాంతంలోనే చెలరేగిన గ్రాంథిక వ్యావహారిక భాషోద్యమం, అప్పారావు గారి ఏకాగ్రతను, దీక్షను రచనా వ్యగ్రతను, వేరొక వైపుకు ఆకర్షించి ఉంటాయి. అంతేకాక లక్ష్మణరావు ఎదురి పక్షంలో వాడు, అంటే గ్రాంథిక వాదుల పక్షానికి చెందినవాడు. అప్పారావుగారిని గ్రాంథికంలోనే కళింగదేశ చరిత్రను రాసి ఇవ్వాలని కోరి ఉండవచ్చు. అప్పారావు అందుకు అంగీకరించి ఉండకపోవచ్చు. 1910 నుంచి 1914 వరకు తెలుగుదేశమంతటా తీవ్రంగా ఈ భాషోద్యమం సాగింది. 1915లోనే అప్పారావు కథావశేషులు కావడమూ జరిగింది. వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్ర సకాలంలో అచ్చు కావడానికి లక్ష్మణరావే కారకుడు. అంతకు పూర్వం పది పదిహేను సంవత్సరాలుగా వీరేశలింగంగారిని స్వీయచరిత్ర ప్రకటనకు పూనుకోవలసిందిగా అభిమానులు, మిత్రులు, ఆప్తులు కోరుతూ ఉన్నా, బలవంతం చేస్తూ ఉన్నా ఆయన అందుకు సరేనంటూ కాలయాపనం చేస్తూ వచ్చారు. మండలి పక్షాన ప్రచురణకు లక్ష్మణరావు అభ్యర్థించినప్పుడు ఆయన సరే అన్నారు. వెంటనే లక్ష్మణరావు 1910వ సంవత్సరంలో చిలుకూరి వీరభద్రరావు గారి ఆంధ్రుల చరిత్రలో రాబోయే పుస్తకాల శీర్షికల క్రింద ప్రప్రథమ స్థానాన్నిచ్చి వీరేశలింగం పంతులు స్వీయచరిత్రను గూర్చి ప్రకటన ఇచ్చారు. ఎందుకింత తొందరపడి ప్రకటించారని వీరేశలింగంగారడిగితే, ఇట్లా చేస్తే కాని మీరు త్వరగా పూనుకోరు, ముగించరు – అని అన్నారుట లక్ష్మణరావు. 1911వ సంవత్సరంలో స్వీయచరిత్ర ప్రథమ సంపుటినీ, 1915వ సంవత్సరంలో ద్వితీయ సంపుటినీ, విజ్ఞానచంద్రికా మండలి తరఫుననే ప్రకటించారు. మండలివారి ప్రచురణలో వీరేశలింగంగారు జన్మించిన గృహము, ఆయన నిర్మించిన మందిరాలు,

మొదలైన వాటి ఛాయాచిత్ర ప్రతికృతులుండడమే కాక మరొక గొప్ప విశేషం కూడా ఉంది. పంతులుగారి చేత వ్రాతకు ప్రతికృతిని కూడా సంతరించడం. వీరేశలింగం పంతులుగారు తమ స్వీయచరిత్రను తమ ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ గారికే అంకితం చేశారు. పంతులుగారు అంకితం చేసిన వాక్యాలనే ఆయన చేతివ్రాత నకలుగా విజ్ఞానచంద్రికా మండలి వారు ప్రథమ సంపుటంలో అచ్చువేశారు. అటు తరువాత వీరేశలింగం గారి స్వీయచరిత్ర ఐదు ముద్రణలు పొందినా, యీ అంకితం ప్రసక్తి లేకపోవడం ఆయన యెడల గ్రంథ ప్రకాశకులు, అపచారం చేయడమే. లక్ష్మణరావు గారు గ్రంథం విషయంలో ఎంత జాగ్రత్త తీసుకొనేవారో, సంపాదకత్వ బాధ్యత వహించి, మార్పులు, చేర్పులు చేయవలసి వస్తే, మృదువుగా వాటిని గ్రంథకర్త దృష్టికి తెచ్చి, సవరింపజేసి ప్రకటించేవారో, గ్రంథం రూపురేఖలను గూర్చి, ముద్రణ విషయమైన మేలిమిని గూర్చి కాగితం, చిత్రపటాలు మొదలైన వాటిని గూర్చి అంతగానూ శ్రద్ధాసక్తులు కనపరచేవారు. జాగ్రత్త పడేవారు. అన్నిటా ఉత్తమంగా ఉండాలని, సర్వాంగసౌందర్యం తొణికిసలాడాలని లక్ష్మణరావు ఆశయం. విజ్ఞాన చంద్రికా మండలి పక్షాన వీరేశలింగం స్వీయచరిత్రకు సంపాదకీయ భూమికను కూర్చింది లక్ష్మణరావే. వీరేశలింగం గారిని ఎంతగా గౌరవించినా, అభిమానించినా, జాతీయవాది అయిన లక్ష్మణరావుకి వీరేశలింగం గారి రాజకీయాభిప్రాయాలు సమ్మతం కాలేదని ఈ భూమికలో లక్ష్మణరావు వాక్యాల వల్లనే తెలుసుకోవచ్చు. వీరేశలింగం వృద్ధతరం వాడు. ఆయనకు జాతీయోద్యమ తీవ్రత పట్ల తాదాత్మ్య దృక్పథం ఉండేది కాదు.

వీరేశలింగం గారి చేత కవుల చరిత్రను పరిష్కరింపించి, పునస్సంశోధిత ముద్రణ వెలువడేందుకు అన్ని విధాల ప్రోత్సాహ, సహకారాలు కూర్చింది కూడా లక్ష్మణరావే. వ్యాధి బాధితుడు, దుర్బలుడు అయిన వీరేశలింగంగారికి తన ఇంట వేద విలాసంలో బస ఏర్పాటుచేసి ఆయనకు ఉపచారాలు చేసి, ఆయన చేత కవుల చరిత్రను సంస్కరింపజేశాడు. వీరేశలింగం గారిని వెంటబెట్టుకొని వెళ్ళి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో నాడు పండితులుగా పనిచేస్తూ వుండిన వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి పరిచయం చేసి, మనమంతా పంతులుగారికి తోడ్పడి, ఆంధ్రకవుల చరిత్రను సంస్కరించి పునర్ముద్రించే విషయంలో వారికి కావలసిన సమస్త సాధన సంపత్తులూ అందించాలని లక్ష్మణరావు గారు కోరినట్లు శ్రీ ప్రభాకరశాస్త్రి గారి స్వీయచరిత్ర ద్వారా తెలుసుకోవచ్చు.

ఆధునిక భారతదేశ చరిత్ర పరిశోధనలో అగ్రగణ్యుడైన కావలి వేంకట బొర్రయ్యను గూర్చి సమకాలికులకు ప్రప్రథమంగా తెలియజేసింది లక్ష్మణరావే. ఆంధ్రపరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవానికి అధ్యక్షత వహించి లక్ష్మణరావు బొర్రయ్యను గూర్చి ఆయన శాసన పరిశోధనను గూర్చి వివరించారు. బొర్రయ్య తమ్ముడు కావలి వెంకటరామస్వామి 1829లోనే

దక్కనుకవుల జీవితచరిత్రలన్న గ్రంథాన్ని ఆంగ్లంలో ప్రకటించాడు. ఆ గ్రంథంలోనే బొర్రయ్యను గూర్చి ఆయన వ్రాశాడు. కల్నల్ కాలిన్ మెకంజీ బొర్రయ్యను గురుతుల్యుడిగా ఎంచుకున్నాడు. భారతీయ మహావిజ్ఞాన సౌధానికి పురా చారిత్రకతత్త్వ శోధనకు బొర్రయ్య నాకు ద్వారంలాగా సాయపడ్డాడని శ్లాఘించాడు మెకంజీ. మిక్కిలి చిరుతవయస్సుననే తన ఇరవై ఆరో ఏట బొర్రయ్య మరణించగా బొర్రయ్యను దహనం చేసిన చోట కల్నల్‌కాలిన్ మెకంజీ ఒక శాసనం వేయించినట్లు వెంకటరామస్వామి పేర్కొన్నాడు. లక్ష్మణరావు తన వార్షికోత్సవ సభ అధ్యక్షోపన్యాసంలో, బొర్రయ్య గూర్చి మెకంజీ వేయించిన ఈ శాసనాన్ని గూర్చి తెలుసుకొనడానికి మద్రాసులోని స్మశానాలు తిరిగి చూసినట్లుగా చెప్పారు. లక్ష్మణరాయుడికి పరిశోధకుల పట్ల గల గౌరవం అటువంటిది. ఆంధ్ర పరిశోధక మహామండలి పంచమ వార్షికోత్సవం 1922వ సంవత్సరంలో జరిగింది.

## వ్యక్తిత్వం

లక్ష్మణరావు నిరంతర విద్యా వ్యాసంగంలోనే పొద్దుపుచ్చుతూ ఉండేవాడు. లక్ష్మణరావు గ్రంథాలయానికి వస్తున్నాడంటే గ్రంథాలయ సిబ్బంది ఆయన కోసం వరసగా కుప్పలు కుప్పలు పుస్తకాలు పేర్చేవారు. తలుపులన్నీ మూసుకొని గ్రంథాలయంలో పనిచేసేవారంతా వెళ్ళేటపుడు కాని ఆయన బయటకు వచ్చేవారు కాదు. ఆయన మేధావి. ఒకసారి తిప్పుతూ పుస్తకాన్ని చదివితే చాలు ఆయనకన్నివిషయాలూ గుర్తుండేవి. ఇంటి దగ్గర ఉన్నా నేలమీద చాప పరచి తన చుట్టూ పుస్తకాలు సగం చదివినవీ, సంప్రదించవలసినవీ పెట్టుకుని క్రింద కూర్చుండి వ్రాసుకుంటూ వుండే వాడాయన. వీరేశలింగం పంతులు గారికి లాగానే ఆయనకు కూడా జీవితంలో ఆస్మా నిత్యం సాహచర్యం నెరపింది. ఈ విధంగా ఆస్మాతో సతమతమయ్యే మనిషి ఇంతగా గ్రంథ పరిశ్రమ ఏ విధంగా చేయగలుగుతున్నాడా? అని మిత్రులంతా ఆశ్చర్యపడేవారు. దగ్గువల్ల, ఆయాసం వల్ల బాధపడుతున్న రోజుల్లో లక్ష్మణరావు బోర్లగిల పడుకొని పుస్తకాలు చదువుతూ వుండేవారు. నిరంతర పఠన వ్యసనం నుంచి ఆయనకు కొంత విశ్రాంతి కలిగించాలని ఆయన మిత్రులు, సన్నిహితులు ప్రయత్నించినా ప్రయోజనం వుండేది కాదు. లక్ష్మణరావుగారి పైన మహారాష్ట్ర సంస్కృతి ప్రభావం చాలా వుండేది. ఆయన వేషంలో కూడా మహారాష్ట్ర లక్షణం కనిపిస్తూనే ఉండేది. కోటు, ఉత్తరీయం, తలపాగా, మీసాలు, వీటన్నిటితో ఆయన మూర్తిత్వం మహారాష్ట్రీయంగా ఉండేది. సంస్కృతంలోంచి మరాఠీలోకి చేరిన పదాలెన్నిటినో ఆయన తెలుగు రచనలలో ధారాళంగా ప్రయోగించారు. ఆయనకు బెంగాలీ, తమిళం, మళయాళం, కన్నడం, ఉర్దూ, హిందీ, సంస్కృతం, పాలీ భాషలలో మంచి పరిజ్ఞానం ఉండేది. అయితే మహారాష్ట్రంపై మక్కువ ఎక్కువ. మహారాష్ట్రుల సంప్రదాయాన్ని అనుసరించే ఆయనగారు కొడుకు పేరు వినాయకరావని పెట్టుకున్నారు. చనువున్న వాళ్ళతో, సన్నిహితులతో ఆయనకు

ఛలోక్తులాడటంలో ఆసక్తి ఉండేది. హాస్యధోరణి కూడా ఉండేదని తెలిసినవాళ్లు అన్నారు. నాగపూర్‌లో ఉన్నత పాఠశాల విద్యాభ్యాసం చేస్తున్న రోజులలోనే ఆయన ఆనాటి మహారాష్ట్ర పత్రికలో ఒక ప్రహసనం ప్రచురించాడు. వృద్ధభర్త–పడుచు భార్య ప్రహసనం అది. లక్ష్మణరావు బావగారైన మాధవరావు గారి దగ్గరకు అప్పుడప్పుడొక వృద్ధుడు వచ్చి తన కుటుంబ వ్యవహారాలన్నీ వెళ్ళబోసుకుంటూ వుండేవాడు. లక్ష్మణరావు రాసిన ప్రహసనం పత్రికలో అచ్చుకాగానే ఆ వృద్ధుడు పళ్లు లేకపోయినా కొరకుతూ వచ్చి చూశావా మీ లక్ష్మణుడి ఆగడం–అని మాధవరావుగారితో ప్రహసనం గూర్చి చెప్పి చాలా ఆగ్రహపడ్డాడు. నేను మందలిస్తాను లెమ్మని చెప్పి మాధవరావుగారు ఆయన్ను శాంతింపజేసి పంపించవలసి వచ్చింది. పాపం వీధి వీధంతా, ఆయనను వేళాకోళం పట్టించారు. తెలిసినవాళ్ళంతా ఆయన్ను చూసి ఫక్కున నవ్వారు. లక్ష్మణరావు పరిశోధనలో నిమగ్నుడైపోయి సృజనాత్మక రచనా వ్యాసంగం వదలిపెట్టాడు. కాని లేకుంటే గొప్ప సృజనాత్మక రచయితగా కూడా రాణించి ఉండేవాడు. ఆయన చదువుకునే రోజుల్లోనే ఒక భావగీతం రచించి పత్రికలో ప్రకటించాడు. ఇల్లాలి మృతిని గూర్చిన కరుణగీతం అది. అప్పటికి లక్ష్మణరావుకి పెళ్ళి కాలేదు. కాని ఆ గీతం ఎందుకు రాశాడో, ఎట్లా వ్రాశాడో కాని, పత్రికలో అది అచ్చయిన తర్వాత రచయితకు సానుభూతి లేఖలు కూడా వచ్చాయట! ఆ గీతంలోని కరుణార్ద్ర భావోద్విగ్నత తమకు కంట తడి తెప్పించినదని, కొందరు పరామర్శ లేఖలు వ్రాశారట. లక్ష్మణరావు పెద్దవాడైన తర్వాత ఈ గీతంలోని చరణాలు ఎప్పుడైనా గుర్తు తెచ్చుకుని చదువుతూ నవ్వుకుంటూ ఉండేవాడట.

ఆయనకు స్త్రీ స్వాతంత్ర్యం పట్ల, మహిళలకు చూపవలసిన మర్యాద పట్ల ఎంతో అభినివేశం ఉండేది. పూర్వాచారపరాయణురాలైన తమ తల్లిగారికి తమకూ జీవితకాలంలో స్థిరంగా సంబంధం తెగిపోయేట్లు పరిణమించిన ఆమె కోరినట్లు, లక్ష్మణరావు తమ కూతురు అచ్చమాంబకు చిన్నతనంలో పెళ్ళి చేయలేదు. తల్లితో ఎంతగా వాదించి చెప్పినా ప్రయోజనం లేకపోయింది. మనవరాలికి యుక్తవయస్సు రాకుండానే పెళ్ళి చేసితీరాలని, లక్ష్మణరావుగారి తల్లి గంగమ్మగారు పట్టుపట్టింది, లక్ష్మణరావు చలించలేదు. ఆ విధంగా చేయకపోతే తాను కాశీ వెళ్ళిపోతానని, మళ్ళీ కొడుకు ఇంట కాలు పెట్టననీ ఆమె కచ్చితంగా చెప్పింది. అయినా లక్ష్మణరావు చలించలేదు. ఆమె అన్నంతపని చేసింది. కొడుకు చనిపోయినాడని తెలిసి కూడా ఆమె కాశీ నుంచి తిరిగిరాలేదు. లక్ష్మణరావు తల్లికి క్రమం తప్పకుండా డబ్బు పంపేవాడు. ఉత్తరాలు వ్రాస్తూ ఉండేవాడు. కాని తాను త్రికరణశుద్ధిగా నమ్మిన ఆశయాల కోసం, సిద్ధాంతాల కోసం, ఆయన పాటుపడేవారు. ఆ విషయాలలో ఆయనకు రాజీ అంటూ లేనేలేదు. చిన్నతనంలో పెళ్ళి చేయకపోవటమే కాదు, లక్ష్మణరావు తన కూతురును ఆ రోజుల్లోనే విదేశాలలో చదువుకోవడానికి కూడా పంపించారు.

హరి సర్వోత్తమరావుగారిని నిర్బంధించి ఆయనపై రాజద్రోహనేరం మోపి కోర్టులో విచారణ జరుగుతూ ఉండగా ఒక రోజున హరిసర్వోత్తమరావుగారి ఇల్లాలు కోర్టుకు పాదచారిగా రావడం లక్ష్మణరావు చూశారు. హరిసర్వోత్తమరావు గారిది పేద కుటుంబం. అందువల్ల ఇంటినుంచి కోర్టుదాకా బండి బాడుగ కూడ ఆమె ఇచ్చుకోలేని స్థితిలో నడిచే వచ్చేవారు. ఇది చూసిన లక్ష్మణరావుకు చాలా ఆగ్రహమూ, బాధ కూడా కలిగాయి. దేశభక్తుడి ఇల్లాలికి ఈ పాట్లా? అని ఆయన ఎంతో నొచ్చుకున్నారు. హరి సర్వోత్తమరావుగారి ఇల్లాలు అప్పుడే నిండుమనిషి కూడాను. ఆ రోజున కోర్టు విచారణ ముగిసి ఇంటికి వెళ్ళేప్పుడు ఆమెగారికి బండి కుదిర్చి పంపించారు లక్ష్మణరావు. ఆ తరువాత కోర్టు విచారణ జరిగినన్నినాళ్ళూ, ఆమె బండిమీద వచ్చి మళ్ళీ ఇంటికి వెళ్ళడానికి ఆయన ఏర్పాటు చేశారు.

లక్ష్మణరావు తమ రెండో మేనమామగారైన భండారు దండపాణి గారి ప్రథమ భార్య చనిపోయినప్పుడు, ఆయన్ను వితంతు వివాహం చేసుకోవడానికి ప్రోత్సహించి, ఆ వివాహం తానే పూనుకొని జరిపించారు. ఇంతేకాక తగిన వసతిలేని తమ బంధువులు, తెలిసినవారి పిల్లలకు లక్ష్మణరావు పీటల మీద కూచుని పెళ్ళిళ్లు జరిపించేవారు. ఆయన ఇంట్లో ఇల్లాలి మర్యాదలకు వీసమెత్తు కూడా లోపం జరుగనిచ్చేవారు కాదుట. ఆమె గొప్పగా విద్యావంతురాలు కాదు. ఆ రోజుల్లో సంప్రదాయాన్ని బట్టి అయినా తమ ఇంటికి వచ్చిన పెద్దలకు, మిత్రులకు లక్ష్మణరావు తమ శ్రీమతిని పరిచయం చేసి ఆమెనెంతో గౌరవించేవారుట.

ఆయన మిక్కిలి నిరాడంబరంగా జీవితం గడుపుకున్నారు. "ఈయన మునగాల రాజాగారి దివాను, మహావిద్వాంసుడు, చారిత్రికాగ్రేసరుడు అయినా లక్ష్మణరావు" అని ఆయనను మొదటిసారి చూసినప్పుడు ఎంతో ఆశ్చర్యం పొందామని శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, తమ "అనుభవాలు-జ్ఞాపకాలలో" వర్ణించారు. ఆయన సాధుశీలము, పాండిత్యం, గాంభీర్యం, ఆర్జవం చాల ఆకర్షణీయమైనవి అన్నారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. విద్వాంసులలో ఆయన హిమాలయోన్నతులు అని అభివర్ణించారు.

లక్ష్మణరావుగారికి నిత్యజీవితంలో కర్మకాండ పట్ల ఆచార వ్యవహారాల పట్ల శ్రద్ధాసక్తులుండేవి కావని చెబుతారు. ఆయన నాస్తికుడు కాకపోయినా అజ్ఞేయవాది. భగవంతుని అస్తిత్వాన్ని గూర్చి విచికిత్స చేయరు అజ్ఞెయవాదులు. ఉంటే ఉన్నాడు. లేకుంటే లేడు. ఆయన ఉనికితో లేదా హుళక్కితో మనకు నిమిత్తం లేదు అనేవారి మతంతో ఏకీభవించేవాడు లక్ష్మణరావు అంటారు. చిన్నతనం నుంచీ కూడా పరిశోధనల పట్ల ఆయనకు చాలా అభినివేశం వుండేది. ఆయనగారికి ఇరవై అయిదేళ్ళ వయసుననే ఆ రోజుల్లో ప్రముఖ సాహిత్య మాసపత్రిక అముద్రిత గ్రంథ చింతామణిలో ఆయన ఒక లేఖ ప్రకటించారు. మహారాష్ట్ర భారతాన్ని,

తెలుగు భారతాన్ని, ఒక ఘట్టం సందర్భముగా పోలుస్తూ, సంస్కృత మహాభారతంలో ఈ విధంగా ఉందని తెలుపుతూ, విద్వాంసులైనవారు తెలుగు మహాభారతంలోని మూలంలోని మార్పు ఎందువల్ల వచ్చిందో తెలియజేయవలసిందిగా ఆయన అర్థించారు. నన్నయ్యకు విపుల శబ్దశాసనుడని బిరుదు రావడానికి కారణమూ, ఆయన వ్యాకరణం రచించిన విషయం యదార్థమేనా తెలియజేయ వలసిందనీ కోరుతునూ, అప్పకవి మహాభారతంలో ఆదిపర్వంలో శకుంతల చరిత్రలోనిదని ఉదహరించిన పద్యం పిన వీరభద్రుని శృంగార శకుంతలంలోనిదని పేర్కొంటునూ, లక్ష్మణరావు చింతామణిలో లేఖ ప్రచురించారు.

ఆయన ఇంకో రెండు గంటల్లో చనిపోతారనగా కూడా సర్దేశాయి విరచితమైన మహారాష్ట్ర చరిత్రను చదువుతూ కాలం గడిపారనీ వారిని గూర్చి వ్రాశారు. 1919వ సంవత్సరం వేదవిలాసంలో సరిగా ఏ కుర్చీలో కూచుని పనిచేసుకుంటూనే వీరేశలింగం పంతులుగారు ఒరిగిపోయి కన్నుమూశారో సరిగ్గా నాలుగు సంవత్సరాల తర్వాత అదే వేదవిలాస్‌లో, అదే కుర్చీలో కూచుని లక్ష్మణరావు కూడా కన్నుమూశారు. 1923 జూలై 13వ తేదీన లక్ష్మణరావు పరమపదించారు.

**అభిజ్ఞుల నివాళులు**

"హిమాలయ పర్వతశ్రేణుల ఔన్నత్యంతో సరిపోల్చదగినది లక్ష్మణరావు పాండిత్యం అని మనస్వి అడివిబాపిరాజు, లక్ష్మణరావు మూర్తిమత్వాన్ని అంచనా వేశారు.

విశ్వనాథ తమ పంచశతి కావ్యాన్ని లక్ష్మణరావు పంతులుగారికి అంకితమిచ్చారు. స్వర్గీయ లక్ష్మణరాయ మహోదయులను సంస్మరిస్తూ విశ్వనాథ

అధునారన సంస్కృతికిని
ప్రధాన బీజమ్మ వీవు పాండిత్యపయో
నిధి వీవు మార్గదర్శిక
సుధారుచివి నిన్ను మరువజొచ్చిరి యాంధ్రుల్.... అనీ

నీ రచితవ్యాసంబు లు
దారంబగు నీదు నాత్మదర్పణముల్ నీ
సారమతి ముద్రగల్గిన
యారంభంబులకు విజయమగుత మహాత్మా..... అనీ జోహార్లర్పించారు.

లక్ష్మణరావు పంతులు గారిని సంస్మరిస్తూ, విజ్ఞానచంద్రికామండలి తెలుగుదేశానికి చేసిన మేలును కీర్తిస్తూ శ్రీ పాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు తమ ప్రబుద్ధాంధ్ర పత్రికలో ఈ విధంగా వ్రాశారు.

"నిజంగా ఆంధ్రులలో లక్ష్మణరావు పంతులు గారి వంటివారు లేరు. ఆ మహానుభావుడు వేసిన ఎత్తులన్నియు పూర్తికాక పూర్వమే దివంగతులగుట ఆంధ్రుల దురదృష్టమనక తప్పదు. లక్ష్మణరావు గారు చనిపోయినారనిన ఒక్క విజ్ఞాన సాగరము ఇంకిపోయినదన్నమాట. వారు విజ్ఞాన చంద్రికను పునరుద్ధరింపవలయునని ఆలోచనలు చేయు సమయమున కాలము హ్రస్వమగుట మరింత విచారకరం" (ప్రబుద్ధాంధ్ర, 1925 మార్చి).

'గుణవంతుండు మనస్వి దీక్షితుడు ప్రాజ్ఞుల్ జ్ఞప్తియందెప్పుడున్
గణుతింపన్ గుణియైన మానవుడు ప్రాక్చారిత్ర వైజ్ఞానికా
గ్రణీ స్వార్థంబుత్యజించి లోకమునకె కష్టించినట్టిందుల
క్ష్మణరావేబదినిండకుండ మునుపే కాయమ్ము వీడెన్గటా –'

**– చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి**

'ఆంధ్రదేశమున సారస్వత చారిత్రక విమర్శనమును బేర్కొనవలసినచో కీ.శే. లక్ష్మణరావు గారి నగ్రగణ్యులుగ నెంచుట తప్పదు. విమర్శనా ప్రపంచమున నిది లక్ష్మణరాయ యుగమని పేర్కొనవలసి యున్నది. సంస్కృతాంధ్రభాషల యందేకాక పెక్కు ద్రవిడ భాషలయందును, మహారాష్ట్రము నందును పండితులై వీరు తమ సునిశిత దృష్టితో రచించిన గ్రంథములు, విమర్శన వ్యాసములు, సర్వతోముఖములై విరాజిల్లుచున్నవి, చరిత్ర రచనమున నిష్పక్షపాత దృష్టియు, మితవాదమును గలిగి వీరి హిందూ మహమ్మదీయ మహాయుగములు నేటికిని జరిత్రకారులకు మూలాధారములై యున్నవి.

***(ఆంధ్ర పరిషత్పత్రిక సం.33. 1944-45)***

'తనువు రుజ్వావృతంబయిన దార్ఢ్యము దప్పుచున్న భాషపై
గనికరముంచి తీవ్రకృషికర్షకరీతి నొనర్చితత్ఫలం
బనిశము నాంధ్రలోకమునకై వినియోగమొనర్చి యుంట నీ
జననము సార్థకంబయి వొసెంగెను లక్ష్మణరాయధీమణీ....!'

**– శేషాద్రి రమణకవులు**

'విజ్ఞానచంద్రికా సంస్థాపనముతో ఆంధ్రదేశమున
సాంస్కృతికముగా ఒక నూతన శకమే ప్రవృత్తమైనది.

**– మల్లంపల్లి సోమశేఖరశర్మ**

# మల్లంపల్లి సోమశేఖరశర్మ

**నాకు** బాగా చిన్నతనం - పదేళ్లుంటాయి. శారద మాసపత్రిక రంగురంగుల బొమ్మలతో మా యింటికి వచ్చేది. రంగుబొమ్మలను చూచే ఉత్కంఠతో పత్రికను తిరగవేసేవాడిని. "శ్రీకృష్ణదేవరాయల పరిపాలన" అనే వ్యాసం కనిపించింది ఆ పత్రిక ఒక సంచికలో. నేను ఉన్నది హంపీ విజయనగర శిథిలాల శివారులోని కమలాపురం. హంపీ విజయనగర శిథిలాలను చూడడానికి వచ్చే మా బంధువులు, పెద్దలతోపాటు నేనూ తరచు వెళ్లడం అలవాటు. హంపీ విజయనగర శిథిలాలకు పాడుపట్నం అని తెలుగులోను, హాళుపట్న అని కన్నడంలోను మా ఊరి వ్యవహారం. ఆ పాడు పట్నంలో ఇది మహర్నవమి దిబ్బ; ఇది కృష్ణరాయల కమల్‌మహల్. ఇది రాణులున్న నగరు; ఇది గజశాల; ఇది గొడుగుపాలుని ప్రతిమ-అంటూ వింటున్నవాడిని, చూస్తున్న వాడిని గనుక ఆ వ్యాసంపై నా దృష్టి లగ్నం కావడం సహజం. చదివాను; మళ్లీ చదివాను; ఇంకా చదివాను. కొంతకు కొంత అర్థమైంది. వ్యాసరచయితపై ఏదో అభిమానం, ఈ పాడుపట్నం పాత రాజుల గురించి ఏదో వ్రాశాడు ఈయన అనే ప్రేమ ఏర్పడ్డాయి. ఆ అభిమానం ప్రేమలకొద్దీ తక్కిన శారద సంచికలూ తిరగేశాను. మొదటి సంచికలో (1923) ఆ వ్యాసకర్తదే. హిందూ దేవాలయము" అనే వ్యాసం చదివాను. దానిలోని భాగాలు కొన్ని వ్రాసుకొన్నాను :- "పూర్వము దేవాలయమే గ్రామమున విద్యామతములు విలయము నొందకుండ గాపాడిన మహాసంస్థ. దేవాలయమే గ్రామమున నాటి గర్మ ధర్మములను వెలయింపజేయుచు వచ్చిన ధర్మపీఠము. దేవాలయమే మతబోధకు నుపన్యాసము లిచ్చు నుపన్యాసవేదిక. శాస్త్రజ్ఞులు వాక్యార్థము చేయు సభాభవనము...." నాకు జ్ఞాపకశక్తి చిన్నప్పటి నుంచే తక్కువ గనుక వ్యాసాలపై - వచనంపై మోజెక్కువ. వాటిని పద్యాలలాగ కంఠస్థం చేయనక్కరలేదు మరి!

శ్రీ శర్మగారిపై ఈ విధంగా పదవయేటనే అభిమానం ఏర్పడింది. కాని, ఈ అభిమానం మరొక సంచికలో ఆయన పేర ఉన్న "భ్రమర ప్రబోధము" అనే గీతపద్య కవితను చూచి కొంచెం తగ్గింది. ఇంత చక్కగా వ్యాసాలు వ్రాసి ఎన్నో విషయాలు నాబోటి పిల్లవాళ్లకు కూడ తెలుపగలిగిన ఈ పెద్దమనిషికి ఇదేమి బుద్ధి? పద్యాలు వ్రాయడం మొదలుపెట్టాడు? పద్యాలు! పద్యాలు! పద్యాలు! ఇంట్లో ఎప్పుడూ ప్రబంధాలు! బయట స్కూలులో పద్యాలు! పక్కన ఉన్న భారతీ రీడింగ్‌రూములో పద్యాలపై చర్చ! ఒక్కటీ అర్థం కాదు పెట్టదు! మంచి సరళవచనం -

మా వాచకాలలో ఉండే వచనం వంటిది వ్రాసే ఈ మల్లంపల్లి సోమశేఖరశర్మకు ఏమి వచ్చింది పద్యాలు వ్రాయడానికి? - అని ఏమేమో అనుకుంటూ చాల కష్టపడ్డాను. ఈ పెద్దమనిషి పద్యాలలో పడి వ్యాసాలు వ్రాయడం మానివేస్తాడేమోనన్నంత భయమూ కలిగింది: ఆ పద్యాలలో కొన్ని పంక్తులివి.

**"మల్లికామతల్లులు కెంజివుళ్లు తొడిగె**
**జివురు చివురున జిఱుమొగ్గ చెన్నుమీఱె**
**మొలకనవ్వుల మొగ్గలు తొలకరించు**
**కొసరియొసపరి క్రొంగ్రొత్త కూర్చుతేనె**
**పదవె తుమ్మెద నీపంటపండె నేడు."**

ఇలా ఈ పద్యాలు దాదాపు రెండు పుటలున్నాయి.

శారద మాసపత్రిక ఆగిపోయింది. 1924లో భారతి మానపత్రిక మరింత ఆకర్షణతో మద్రాసు నుంచి వెలువడసాగింది. శ్రీ శర్మగారు దానిలోను వ్యాసాలు వ్రాయడం ప్రారంభించారు. శర్మగారిపై ఉన్న గౌరవం కొద్దీ అహదన కరశాసనం, చర్చలు, విమర్శలు, ప్రతి విమర్శలు, ప్రతి విమర్శ పరామర్శలు చదివేవాడిని. ఏమీ అర్థమయ్యేది కాదు; తర్వాత పదేళ్లకు గాని విషయ పరిజ్ఞానం కలుగలేదు.

శర్మగారు అలాగే కవితామార్గంలో నడిచి ఉంటే, గొప్ప కవి అయి అవార్డులూ పొందేవారేమో! కాని, తెలుగువారి అదృష్టం! ఆయన చరిత్రకారులుగానే మిగిలారు; తెలుగు వారికి తమ పూర్వుల గొప్పదనాన్ని వేయి విధాలుగా తెలియజేశారు; అనేకానేక విషయాలను ఏర్చి కూర్చి ఇతిహాస మాలికలు గుచ్చి, తెలుగుతల్లి కంఠాన్ని, భారతమాత గళాన్ని అలంకరించారు.

తర్వాత పదేళ్లకు మద్రాసులో, ఆంధ్రపత్రిక కార్యాలయంలో శర్మగారిని దర్శిస్తూ కొంత చనువు ఏర్పడిన తర్వాత నా చిన్ననాటి భావాలు తెలిపాను. ఆ సౌమ్యసుందర గంభీరమూర్తి ఒక చిరునవ్వు నవ్వి నా వీపు చరిచారు. "మీకు అలా అనిపించిందేమో కాని, నిజానికి కవికున్నంత గౌరవం సంఘంలో చరిత్రకారునికి లేదు. ఏవో పాత పీనుగులు తవ్వుతారు, ఏమిటీ ప్రయోజనం? ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఎందుకు, దేనితో ఛస్తేనేమిటిట? ఏ రాజుకు ఎందరు రాణులుంటే ఏమిటిట? - అంటారు. వ్యాసాలు ఎవరు చూస్తారు?" అన్నారు. నిజమే. ఆయన మాటలు ఐదు దశాబ్దాల తర్వాత నేడూ నిజాలేమోననిపిస్తుంది. ఆయన కవిగానూ సమకాలీన కవులకేమీ తీసిపోయేవారు కారు. అయినా, నేను మాత్రం ఆయనకైతకైపులో పడి కొట్టుకొనిపోకుండా చరిత్రకే జీవితాన్ని మీదు కట్టడం తెలుగువారి భాగధేయమని నాడూ భావించాను; నేడూ భావిస్తున్నాను.

శర్మగారు తాము చిన్ననాడే ప్రారంభించిన చరిత్ర పరిశోధన రంగానికే అంటిపెట్టుకొని ఉండడానికి కారణం పిల్లులను పుత్రవాత్సల్యంతో చూడడమేనేమో! అరవైయేళ్లనాడు శర్మగారు రాజమహేంద్రవరం నుంచి భద్రాద్రికి పడవలో బయలుదేరారట. చంకలో పిల్లి కూడా ఉంది; సామెత చెప్పినట్టు పడవ పాపికొండలు దాటీ దాటగానే ఒక చట్రాతికి తగిలి రెండు బద్ధలయిందట. వీరున్న చెక్క అదృష్టవశాత్తు ఒక చిన్న ఇసుకదిబ్బకు చేరిందట. ఎట్లో ప్రాణాలు దక్కిన ఆ ప్రమాదంలోను శర్మగారి ప్రాణాలన్నీ ఆ పిల్లిమీదే ఉన్నాయట. అది పడిపోకుండా, ఎగిరి దూకిపోకుండా గుడ్డలో చుట్టి గట్టిగా పట్టుకున్నారట. పిల్లుల స్వభావంతామున్న ఇంటినే అంటిపెట్టుకోడం.

ఈ గుణమే ఆయనను గొప్పవాణ్ని చేసింది. ఆయన శిష్యవర్గం ప్రచారంతోగాని, అభిమానుల ఆదరంతోగాని, అధికార ప్రాభవంతోగాని గొప్పవాడయినవాడు కారు, తమ పరిశోధన ప్రవణతోనే, దాని ఫలితమైన అపూర్వావిష్కారాలతోనే, ప్రామాణిక రచనలతోనే గొప్పకెక్కినట్టివారు.

ఇలాటి శర్మగారు 1891 డిసెంబర్ 24న పశ్చిమ గోదావరి జిల్లా మినుమించిలిపాడు గ్రామంలో జన్మించారు. వీరి తండ్రిగారు భద్రయ్యగారు, తల్లిగారు నాగమ్మగారు. వీరు సనాతన ఆరాధ్య బ్రాహ్మణులు. వీరికి ముగ్గురు సోదరీమణులు, ఒక సోదరుడు. శర్మగారు ఊరిబడిలోను తండ్రిగారి వద్ద ప్రాథమిక విద్య పూర్తి చేసిన తర్వాత, హైస్కూలు చదువుకోసం రాజమండ్రి వెళ్లారు. అక్కడ తమ మేనమామ అయ్యగారి ఉమామహేశ్వరరావు గారింట ఉండేవారు. ఆ దశలోనే ఆయనకు జీవితంలో ఏదైనా లక్ష్యం సాధించాలంటే, ఓర్పు, శ్రద్ధ, అకుంఠిత కార్యదీక్ష అవసరమని తెలిసింది. చిన్ననాడు ఆయనకు అబ్బిన ఈ గుణాలు చివరివరకు అమృతఫలాలను ఇచ్చాయి.

శ్రీశర్మగారు రాజమండ్రిలో ఉన్న సమయం ఆధునికాంధ్రనవజీవనోద్యమ సమయం. రాజకీయ వాతావరణం కూడ గంభీరంగా ఉండేది. విదేశపాలన భారాన్ని ప్రతివ్యక్తీ అనుభవిస్తున్నట్టు ఉండేది. అప్పుడే శర్మగారికి స్వతంత్రంగా జీవితం సాగిస్తూ దేశం కోసం, రాష్ట్రం కోసం, సాహిత్యం కోసం గొప్ప పనులు చేయాలనే సంకల్పం కలిగింది.

మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణులయిన పిదప ఆయన స్వగ్రామానికి తిరిగివెళ్లారు. కాలేజీ చదువుకు ఆయన మనస్సు ఉవ్విళ్లూతలూగింది. కాని, కుటుంబ పరిస్థితులు ఆయన ఆశలను కొనసాగించలేదు. కనుక ఇంటిలోని పెద్దలు ఆయనను ఉపాధ్యాయవృత్తిలో చేరమని పోరుపెట్టారు. అప్పుడు పల్లెటూరి బడి పంతులజీతం నెలకు పది రూపాయలు. శర్మగారు ఇంట్లో పోరు పడలేక ఆ పనికి దరఖాస్తు పంపారు. కాని ఉద్యోగం రాలేదు. శర్మగారు

దానిని దైవానుగ్రహంగా భావించారు. మళ్లీ పెద్దల మాట కాదనలేక సబ్‌రిజిస్ట్రారు కార్యాలయంలో గుమాస్తా పనికి దరఖాస్తు చేశారు. అదీ రాలేదు. శర్మగారికి గుమాస్తా పని ఎప్పుడూ ఇష్టం లేదు. ఆయన ఇష్టానికి అనుగుణంగానే పనీ రాలేదు. ఆయన సహజంగానే స్వాతంత్ర్యాభిలాషి గనుక తనకు నచ్చిన ఉద్యోగాన్ని అన్వేషించడానికి రాజమండ్రి బయలుదేరారు. బయలుదేరేముందు తమ మెట్రిక్యులేషన్ యోగ్యతాపత్రాన్ని సోమశేఖరుడు మన్మథుని కాల్చినట్టు తగులబెట్టారు. ఆ సమయంలో ఆయనకు వివాహం జరిగింది. సతీమణి పెద్ద మేనమామ కుమార్తె సుబ్బాయమ్మ గారు.

శర్మగారు సతీసమేతంగా ఉద్యోగాన్వేషణకు రాజమండ్రి బయలుదేరారు. ఎక్కడ ఉండాలో తెలీదు; ఏమి ఉద్యోగమో తెలీదు. బయలుదేరారు. అంతే, రాజమండ్రిలో ఆయన పినతల్లి కుమారుడు చాగంటి సుబ్రమణ్యంగారు ఆశ్రయమిచ్చారు. ఆయన ప్లీడరు గుమాస్తా. ఆయన ఒక అడ్వకేటు వద్ద శర్మగారికి గుమాస్తా పని చూపించారు. కాని శర్మగారికి నచ్చలేదు. గుమాస్తాగిరి వద్దని గదా ఇక్కడికి రావడం!

అప్పుడు చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు రాజమండ్రి నుంచి 'దేశమాత' అనే వార్తాపత్రికను నడుపుతున్నారు. శర్మగారు కాకతాళీయంగా ఆయనను దర్శించడం తటస్థించింది. లక్ష్మీ నరసింహం గారు శర్మగారి ఆశయాలనుగ్రహించి నెలసరి పన్నెండు రూపాయల జీతంపై తమ పత్రికలో సబ్ ఎడిటర్‌గా నియమించారు. శర్మగారికి ఎంతో సంతృప్తి కలిగింది. శర్మగారు చాగంటి సుబ్రహ్మణ్యంగారికి ఈ సంగతి చెప్పి, ఆయన అనుమతితో ఒక గదిని అద్దెకు తీసుకొని జీవితం ప్రారంభించారు.

శర్మగారు 'దేశమాత'లో కథలు, వ్యాసాలు, నాటికలు వ్రాసేవారు. దానితో శర్మగారికి రాజమండ్రిలోని సాహిత్యవేత్తల పరిచయం కలిగింది. క్రమంగా ఆయనపై చరిత్ర చతురాననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి దృష్టి పడింది. ఆయన అప్పుడు ఆంధ్రదేశ చరిత్ర వ్రాస్తూ, మరొకవైపు వివిధ విషయాలు సేకరిస్తున్నారు. ఆ విషయాలను నకలు చేయడానికి ఒక చరిత్ర జ్ఞానం గల వ్యక్తి అవసరమయ్యాడు. శర్మగారి దస్తూరి చాల చక్కనిది. అది ఆయన నిశితబుద్ధికి, నిష్కల్మష హృదయానికి, పరిశోధనాసక్తికి ప్రతీకగా ఉండేది. శర్మగారు రావుగారికి ఈ విషయ సేకరణలో తోడ్పడి, చక్కగా సాఫుప్రతి వ్రాస్తూ, ఎంతో సహాయపడ్డారు. రావుగారి వంటి గొప్ప చరిత్రకారుని వద్ద పొందిన శిక్షణ శర్మగారికి ముందు ముందు ఎంతగానో ఉపయోగపడింది.

రాజమండ్రిలో శర్మగారికి సుబ్బరాయడుగారనే బంధువుండేవాడు. ఆయన కోసం శర్మగారు చిన్నకథలు, అంతర్వేది, గంగమ్మ చరిత్ర, దసరాపద్యాలు, పడవపాటలు

మొదలయినవి వ్రాసేవారు. ఆ సుబ్బరాయడుగారు వాటిని చిన్న పుస్తకాలుగా ముద్రించి అమ్ముకొనేవాడు. ఆయన తన దుకాణంలో అగ్నిప్రమాదం జరిగి దుకాణం కాలిపోవడం వల్ల అప్పులవాళ్ళకు భయపడి పారిపోయాడు. వాటిని వ్రాసిన వారు శర్మగారు గనుక అప్పులవాళ్లు ఆయనను పట్టుకున్నారు. ఆ అప్పుబరువంతా శర్మగారు మోయవలసి వచ్చింది.

శ్రీ శర్మగారు ఆంధ్ర నవజీవనోద్యమంలో విరిసిన మందారం గనుక, భాషాసాహిత్యాలను బాగా ఆకళించుకొని, ఆ చిన్నవయసులోనే కవిగా, నాటకకర్తగా పేరు పొందారు. పాదుకా పట్టాభిషేకమనే నాటకం వ్రాసి ఆడించారు. రోహిణీచంద్ర గుప్త, అరణ్యరోదనం, వివేకము గల మంత్రి మున్నగు నవలలు రచించారు. అవి చాల పాఠక రంజకాలయ్యాయి. ఆయన రచనలలోని పాత్రలు సమకాలీన సమాజస్థితిని ప్రతిఫలింపజేసేవి. ఆయన శైలి కూడ రమ్యంగా ఉండేది గనుక సాహిత్యరంగంలో విఖ్యాతి పొందడమేకాక, పలువురు నవరచయితలకు, కవులకు మార్గదర్శకంగాను ఉండేవారు.

ఆయన 'దేశమాత'లో పనిచేస్తూన్నప్పుడు (1914-18) ఆంధ్రచరిత్రాధ్యయనంపై శ్రద్ధ కలిగించడం కోసం 'ఆంధ్రాభ్యుదయ గ్రంథమాల' అనే గ్రంథాలయాన్ని స్థాపించారు. తాము సేకరించిన చారిత్రక విషయాలు ఆధారంగా, ఆంధ్రవీరులు, ప్రాచీన విద్యాపీఠాలు, ప్రాచీనాంధ్రనౌకాయానం మున్నగు ప్రామాణిక వ్యాసాలు వ్రాశారు. ఈ రచనలు ఆయనకు పండితుల, పరిశోధకుల గుర్తింపు కలిగించాయి. ఆయన సామాన్య రచయిత కాదు, శ్రద్ధాసక్తులు, సత్యదృష్టి గల పరిశోధకుడు సుమా! - అనే భావం కలిగించాయి. చరిత్ర అంటే కేవలం రాజవంశాల, యుద్ధాల, విజయాల, రాణుల విలాసాల కథనం కాదని, ప్రజల జీవితం, వారి సంస్కృతి, నాగరికతల వర్ణనమని నమ్మినవారు ఆయన. కనుక ప్రాచీనాంధ్ర ప్రజల జీవిత రహస్యాలను గురించి అవలోడించేవారు.

సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు అప్పుడు మద్రాసులో బ్రిటిష్ విజ్ఞాన సర్వస్వరీతిలో తెలుగు విజ్ఞాన సర్వస్వాన్ని సంకలనం చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. శర్మగారి రచనలకు ముగ్ధులై తమకు సహాయకులుగా రమ్మని కోరారు. శర్మగారు కూడ అలాటి పనిని ప్రేమించేవారు గనుక రాజమండ్రి నుంచి మద్రాసుకు మకాం మార్చారు. శర్మగారు లక్ష్మణరావుగారి మార్గదర్శకత్వంలో, పర్యవేక్షణలో విజ్ఞానసర్వస్వం కోసం విషయసేకరణ సంకలనాలను నిరాఘాటంగా కొనసాగించారు. వివిధ విషయాలపై తమ జ్ఞానభండారాన్ని నింపుకొన్నారు.

శర్మగారి మద్రాసు నివాసం ఆయనకే కాక తెలుగు విద్యావంతులందరికీ ప్రయోజనకరమైంది. ఆయన ఇల్లు ఒక తీర్థయాత్రాస్థలం-సాహిత్య తీర్థయాత్రాస్థలం. 1926లో

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ జరిగినప్పుడు ఆయన యిల్లు రెండవ కాంగ్రెస్ సభామండపంలా ఉండేది. ఆయన అందరినీ ఆదరించేవారు. ఆదరించేవారుంటే అతిథులకేమి తక్కువ?

కాని శర్మగారి విజ్ఞానసర్వసంకలనోద్యోగం ఎంతోకాలం సాగలేదు. లక్ష్మణరావుగారు అకాలమృత్యువు వాతబడడంతో పని ఆగిపోయింది. కనుక శర్మగారు మద్రాసు వదలవలసి వచ్చింది. తర్వాత కొన్నేళ్లకు శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు విజ్ఞానసర్వస్వ సంకలన కార్యాన్ని పునరుద్ధరించినప్పుడు దానిని నిర్వహింపగలవారు శర్మగారు తప్ప ఇంకొకరేరీ? కాని శ్రీ నాగేశ్వరరావుగారు 1938లో శివైక్యం చెందడంతో విజ్ఞానసర్వస్వ సంకలనం మళ్లీ ఆగిపోయింది. అప్పటి 'అ' అక్షరం నుంచి 'అధ్వర్యు' వరకు రెండు సంపుటాలు వచ్చాయి. ఆంధ్ర అనేది మూడవ సంపుటి. ఆగిపోయింది. శర్మగారు ఆంధ్ర వారపత్రిక సంపాదకులయ్యారు. దానిని తీర్చిదిద్ది ప్రామాణికం చేశారు.

శ్రీశర్మగారు ఆంధ్రపత్రికలో ఉండగా, 1927లో త్రివేణి ఆంగ్లమాసపత్రిక, జయంతి ఆంధ్ర మాసపత్రిక వెలువడ్డాయి. త్రివేణికి శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు సంపాదకులు, జయంతికి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు సంపాదకులు. త్రివేణి ప్రారంభోత్సవంలో విశ్వనాథ సత్యనారాయణ గారు. 'ఆంధ్ర ప్రశస్తి' అనే కావ్యాన్ని శర్మగారికి అంకితమిచ్చి, అందరికీ ఆశ్చర్యం కలిగించారు. శర్మగారికి కూడా ఈ సంగతి తెలియదు. ఆనాటి సభలో విశ్వనాథ సత్యనారాయణగారు అంకితమిస్తూ

"నీవనుకోనులేదు మరి
    నేనిది చెప్పనులేదు కాని అ
న్నా వినవయ్య నేటికిది
    నాచిరుపొత్తము నీకు నంకితం
బై వెలయింపజేతు హృద
    యంబులు నీకును నాకు మాతృదే
శావిల దుఃఖదారిత వి
    షాదములై శ్రుతిగొల్పె నేటికిన్"

అని అందజేశారు. శర్మగారిని గూర్చి ఇలా ప్రశంసించారు.

"డిగ్రీలు లేని పాండిత్యంబువన్నెకు
    రాని యీ పాడుకాలానబుట్టి
నీ చరిత్రజ్ఞాన నిర్మలాంతః పూర
    మూషర క్షేత్ర వర్షోదకమయి

చాడీలకు ముఖప్రశంసల కీర్ష్యకు
స్థానమైనట్టి లోకాననుండి
నీ యచ్యుతర కమనీయలీల జ్యోత్స్న
అడవిగాచిన వెన్నెలగుచు వెలిగి
అంతెకాని గౌరీశంకరాచ్ఛ శృంగ
తుంగము త్వదీయ మనస్సు పొంగి తెలుగు
నాటి పూర్వచరిత్ర కాణాచియెల్ల
త్రవ్వి తలకెత్తలేదె యాంధ్రజనములకును"

అని వాపోయారు. శర్మగారి పరిశోధన, తత్ఫలితాల ప్రచురణ పుంఖానుపుంఖంగా సాగింది.

కాని, శర్మగారి ప్రధాన పరిశోధన శాసనపరిశీలన, శాసన విషయాలు ఆధారంగా ఆంధ్రదేశ చరిత్ర పునర్నిర్మాణం. శాసనాలను అన్వేషించి కనిపెట్టడం, వాటిని సక్రమంగా చదివి చరిత్రకు అన్వయించడం శర్మగారికి వినోద విలాసం. శాసన పఠనంలో ఉన్నప్పుడు ఆయనకు తిండీతిప్పలు అక్కరేలేదు. ఆయన శాసనాలు ఎక్కడ ఉన్నవని విన్నా అక్కడికి వెళ్లేవారు. ఆయన డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య గారితోపాటు ఎర్రగుడికి వెళ్లి అశోకశాసనం కనుగొన్నారు. ఆయనతో కలిసే రాయలసీమ జిల్లాలలోను, నెల్లూరుజిల్లాలోను పర్యటించి పెక్కు శాసనాలు పరిశీలించి అమూల్య అపూర్వ విషయాలు సేకరించి, భారతి, ఎపిగ్రాఫియా ఇండికా, ఆంధ్రపత్రిక మున్నగు పత్రికలలో ప్రచురించారు. అలా ప్రచురించినవే కడపటి పల్లవుల కాలనిర్ణయం, వేంగీచాళుక్యులు, వాతాపి చాళుక్యులు, కళింగ కదంబులు, త్రిలోచన పల్లవుడు, వడ్డవారము, బౌద్ధమత పరిణామం, పాల్కురికి సోమన, జక్కన కవి కాల నిర్ణయం, కులముల సంఖ్య, చారిత్రక శతకములు, తంజావూరు మహారాష్ట్ర భూపతులు మున్నగు అపూర్వ వ్యాసాలు వెలయించారు. మౌర్య, శాలంకాయన, ఆదిమ చాళుక్య, పూర్వచాళుక్య, కాకతీయ, దేవరకొండ, వెలమ, రేనాటి చోళ, ముసునూరి నాయక, రెడ్డి, విజయనగర సార్వభౌముల తామ్ర శిలాశాసనాలను పెక్కింటిని కొత్తవాటిని ముప్పయికి పైగా ప్రచురించారు. వీటిని బట్టి ఆయన ఆంధ్రదేశ చరిత్ర జ్ఞానం ఎంత విశాలమైనదో తెలుసుకోవచ్చు. శాసనపఠనంలోను, శాసన భాషా వివేచనంలోను, లిపి నిర్ణయంలోను ఆయన కౌశలం అత్యద్భుతం, అనిదలిపూర్వం. అహదనకరశాసనంలోని వింత అక్షరమైన ళ ను గురించి శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారితో జరిగిన సుదీర్ఘచర్చలో శర్మగారు ఎంతో నిబ్బరంతోను, ఉదాత్తతతోను ప్రవర్తించారు శాస్త్రిగారిలాగే. శాసనలిపి చణత్వంలో శర్మగారు యావద్భారతంలోను శ్రీ కె.పి. జయస్వాల్, పద్మభూషణ శ్రీ టి.ఎన్. రామచంద్రన్ వంటివారికి సమానస్కంధులుగా కీర్తిపొందారు.

సమకాలీన లిపి శాస్త్రజ్ఞులు శ్రీ వెంకయ్య, చక్రవర్తి, సి.ఆర్.కృష్ణమాచార్యులు, ఛాబ్రా వంటివారు ఆయననను ఎంతో గౌరవంతో చూచేవారు. భారత ప్రభుత్వం ఎపిగ్రాఫిస్ట్‌గా ఉన్న కృష్ణమాచార్యులు శర్మగారిని గురించి చేసిన ప్రశంస ఇక్కడ ఉదాహరించడం సముచితం. "శ్రీ శర్మగారు ప్రాఙ్నన్నయ యుగపు శాసనాలలోని పద్యాలను సంస్కరించి ప్రచురించి ఆంధ్రభాషావాఙ్మయచరిత్రకు గొప్ప సేవ చేశారు. ఆయన కృషిలో సరైన చరిత్రావగాహన, సత్యనిష్ఠ, న్యాయమైన భారతచరిత్ర పునర్నిర్మాణ దృష్టి ప్రస్ఫుటాలు. శర్మగారిలాగ దక్షిణ భారత దేశ చరిత్రలో గొప్ప కృషి చేసినవారు తెలుగుదేశంలో ఇంకొకరు నాకు కానరారు."

ఆంధ్రవిశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా ఉన్న డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి గారు శర్మగారి ప్రతిభను గుర్తించారు. అటువంటి పరిశోధకులు చరిత్రశాఖలో ఉండడం అవసరమని భావించి ఆహ్వానించదలచారు. విశ్వవిద్యాలయ కళాశాలల ప్రిన్సిపాలుగా ఉన్న శ్రీ విస్సా అప్పారావుగారు రెడ్డిగారి అభిప్రాయాన్ని బలపరచారు. దాని ఫలితంగా శర్మగారు 1940 నుంచి 46 వరకు ఆంధ్రవిశ్వవిద్యాలయం చరిత్రశాఖలో పరిశోధకులుగా పనిచేసి, రెడ్డిరాజుల పరిపాలన విషయాలను ప్రత్యేకంగా పరిశోధించి, 'ఆంగ్లం'లో రెడ్డి కింగ్‌డం అనే ప్రామాణికమైన ఉద్గ్రంథం రచించి ప్రచురించారు. అలాగే కాకతీయరాజ్యపతనానంతరం విజయనగర రాజ్యసంస్థాపన వరకు అస్తవ్యస్త చరిత్రను సవరించి, తాము కనుగొన్న 'విలస' తామ్రశాసనం ఆధారంగా ఫర్గాటన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్రా హిస్టరీ అనే గ్రంథాన్ని రచించి ప్రచురించారు. దీనిని భారత చరిత్రకారులందరూ గొప్ప పరిశోధన గ్రంథంగా అంగీకరించారు. దీనివల్ల ఫెరిస్తా వ్రాతలపై వ్రాసిన చరిత్ర గ్రంథాలలోని పొరపాట్లు సవరింపబడడమే కాక, భారత చరిత్రావగాహనకు గొప్ప తోడ్పాటు కలిగింది.

శర్మగారు తమ పరిశోధన జరుపుతూనే ఆనర్స్ విద్యార్థులకు ఎపిగ్రఫీ బోధించారు. లిపిశాస్త్రంలో మెరికలవంటి వారిని తయారుచేయాలని ఆయన కోరిక. కాని ఈ కోరిక కోరికగానే ఉండిపోయింది. దీనికి కారణం విజ్ఞానసాంకేతికశాస్త్రాలపట్ల విశ్వవిద్యాలయ నిర్వాహకులకు ఉన్నంతశ్రద్ధ చరిత్రశాఖపై లేకపోవడం, సద్యఃఫలంకోరే విద్యార్థులు చరిత్రపై అంతగా ఆసక్తి చూపకపోవడమూను.

శర్మగారి ఉద్యోగపు గడువు పూర్తికాగానే విశ్వవిద్యాలయ నిర్వాహకులు గడువును మరికొన్ని సంవత్సరాలు పొడిగిద్దామని నిశ్చయించారు. కాని, శర్మగారు అనారోగ్య కారణంగా, పనిచేయడానికి ఒప్పుకోలేదు. సకుటుంబంగా మద్రాసుకు తరలివచ్చారు. శర్మగారిని వదలుకోడం డాక్టర్ సి.ఆర్.రెడ్డిగారికి ఎంతమాత్రమూ ఇష్టం లేదు. ఆయన అసదృశ పరిశోధనలను ప్రశంసిస్తూ ఇలా వ్రాశారు వీడ్కోలు సందర్భంగా – "మిమ్ములను వదలుకోలేకపోతున్నాము. మీరు చేసిన అమూల్య కృషిని నా పక్షాన, విశ్వవిద్యాలయం పక్షాన ప్రశంసిస్తున్నాను. మీ పరిశోధనలు మహోన్నతమైన శాస్త్రీయ పద్ధతులలో ఉండడం

మాత్రమే కాక, సత్యనిష్ఠను, నిరంతరదీక్షను, గంభీరచారిత్రక సమన్వయాన్ని ప్రస్ఫుటింపజేస్తున్నాయి."

శర్మగారు మద్రాసులో రెండుసార్లు ఆగిపోయిన విజ్ఞానసర్వస్వ సంకలన కార్యక్రమాన్ని మళ్లీ కొనసాగించాలని ప్రయత్నిస్తున్నారు. దానికి మంచి అవకాశం కలిగింది, దేశం స్వతంత్రమైంది. అప్పటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం విజ్ఞానసర్వస్వాది బృహత్ప్రణాళికలను చేపట్టడం కోసం తెలుగుభాషాసమితిని స్థాపించింది; శర్మగారిని సంకలకర్తగా రమ్మని ఆహ్వానించింది. ఆయన వెదకబోయిన తీగ కాళ్లకు తగిలినట్లు సంతోషించి, అంగీకరించారు. శర్మగారు తెలుగుసంస్కృతి సంపుటాలకు సంపాదకులుగా ఉండి అపూర్వకృషి చేశారు. అవి ఆయన దేశభక్తికి పరిశోధన ప్రవణతకు, అకుంఠితదీక్షకు శాశ్వత నిదర్శనాలని అందరి ప్రశంసలు అందుకున్నాయి. శర్మగారు 1957 వరకు విజ్ఞాన సర్వస్వ కార్యాలయంలో పనిచేశారు.

ఈలోగా ఆచార్య వి.యస్.కృష్ణ ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ అయ్యారు. ఆయన ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర ఆర్థిక రాజనీతిశాస్త్రశాఖలు నిర్వహించేవారు. శర్మగారి వంటి మహాపరిశోధకులు తమ శాఖలో ఉండడం అవసరమని భావించారు. ఆయనను చరిత్రశాఖలో ప్రాచీనశిలాశాసన నాణకశాస్త్రోపన్యాసకులుగా నియమించారు. శర్మగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో 1957 నుంచి 1963 జనవరి వరకు ఉన్న కాలం చాల విలువైనది.

దేశానికి మహాప్రయోజనకరమైనదని, ఈ సమయంలో ఆయన విద్యార్థులకు బోధించడం మాత్రమే కాక, మహా తీవ్రంగా పరిశోధన సాగించారు. వందలకొలది పరిశోధన వ్యాసాలు వ్రాశారు. ఆంధ్రజాతి వైభవాన్ని చాటుతూ పెక్కు రేడియో ప్రసంగాలు చేశారు, బహిరంగక వ్యాసాలు చేశారు. ఉదాత్తమైన జీవితం గడుపుతూ దేశసేవకు సన్నద్ధులుగా ఉండాలని యువకులను ప్రోత్సహించారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగులిపి సంస్కరణ కోసం ఒక సంఘాన్ని ఏర్పాటు చేసి శర్మగారిని అధ్యక్షునిగా నియమించింది. దీనిలో నేను కూడ ఒక సభ్యుణ్ని. శర్మగారు తమ వివిధ లిపి పరిజ్ఞానంతో, ఆధునిక ముద్రణ సౌకర్యాలు దృష్టిలో పెట్టుకొని, తెలుగులిపి సౌందర్యం చెడకుండా పెక్కు సూచనలు చేశారు.

శర్మగారు స్ఫురద్రూపులు. పచ్చని మైదానం. విశ్వనాథ సత్యనారాయణగారు వర్ణించినట్లు

*"కొరమ తుమ్మెద తెక్కల గుస్తరించు*
*మీసములనీ ప్రసన్న గంభీరముఖము*
*కన్నులంటగ గట్టినట్లున్న (నిన్ను*
*మఱచిపోలేరు జన్మజన్మములకైన)"*

సుందరవిగ్రహాన్ని ఎవ్వరూ మరచిపోలేరు, భారతి సంపాదకులుగా పెక్కుమంది రచయితలను తీర్చిదిద్దిన సంపాదకశిల్పి శ్రీ గన్నవరపు సుబ్బరామయ్యగారి మాటలలో శర్మగారి శీల స్వభావాలను తెలియజేస్తాను.

"మా శర్మకు మొదటినుండి విజ్ఞానార్జనలో ఉండే ఆసక్తీ, శ్రద్ధా, పట్టుదలా, నేర్పూ ధనార్జనలో లేదు. అందువల్లనే అతని విజ్ఞానరంగం ఇంత ప్రకాశవంతంగా ఉండినా, జీవితరంగం మాత్రం చీకటికోణమే. ఎప్పుడూ పైసాకు పాకులాటే. అయినా శర్మకది లక్ష్యమా? ఎప్పుడూ ఇంటినిండుగా ఏ చుట్టాలో, ఏ స్నేహితులో, ఏ పరిచితులో ఉంటూ ఉంటారు. వారికి నిత్య సంతర్పణలు సాగుతూ ఉంటవి. ఎట్లాసాగుతూ ఉంటాయో అదంతా ఒక ఇంద్రజాలం. ఎప్పుడూ కూడ శర్మ ముఖంలో దైన్యంకాని, అసంతృప్తి కాని కనపడుతోందా? ఊహు! ఎప్పుడూ నవ్వుతో కలకలలాడుతూ స్వాగతం చెబుతూ ఉంటాడు అందరికీ. మా శర్మది మనుష్యాతీతమైన ప్రకృతి అనవలెను. అంతే.

"శర్మకు మించినది శర్మ యిల్లాలు. సౌజన్యంతో, ఓర్పుతో ఇతర సుగుణాలలోను "అన్నపూర్ణకు నుద్దియౌనతని గృహిణి" దీని అర్థం ఆ ఉత్తమ ఇల్లాలు విషయంలో సర్వాంగీణంగా చరితార్థమౌతుంది.

"శర్మ స్వాతంత్ర్యప్రియుడు, కాని సరసుడు. గుణం మెచ్చుకొని హర్షిస్తాడు కాని అసూయపడడు. స్వాభిమానం ఎప్పుడైనా ఏ పిసరైనా చూపునేమో, కాని స్వాతిశయ ప్రకటనానికి బొత్తిగా ఇష్టపడడు. అయితే తరుచూ మొగమోటపడి మోసపోతూ ఉంటాడు, మా శర్మకిది పెద్ద దౌర్బల్యం. ఎన్నిమార్లు అనుభవమైనా, ఎంత అపకారం జరుగుతూ వచ్చినా ఈ దౌర్బల్యాన్ని పోగొట్టుకోలేకుండా ఉన్నాడు.

"శర్మ సౌందర్య పిపాస కలవాడు, సుకుమారమైన అంతఃకరణం కలవాడు; క్రౌర్యాన్నీ, హింసనూ, అసభ్యతనూ, అనాగరకతనూ సహించలేడు. అతడు సుహృదయుడైన సహృదయుడు. అతనితో మైత్రికి ఏ అవాంతరాల వల్లనూ అంతరాయం కలుగదు.

"సంపూర్ణమయిన ఆంధ్రతాముద్ర కలవాడు మా శర్మ. అపరిమితమైన దేశాభిమానం కలవాడు మా శర్మ; నిరంతరమూ ఆంధ్రాభ్యుదయాన్నే ఆశిస్తూ ఉన్నవాడు చరిత్రరచనాధురీణ మా మల్లంపల్లి సోమశేఖర శర్మ."

ఆ సహృదయుతామూర్తికి, అనమాన మేధావికి పలువురు తమకృతులు అంకితమిచ్చారు. విశ్వనాథవారు ఆంధ్రప్రశస్తిని అంకితమిచ్చినది ఇదివరకే చెప్పాను. ఆయన అంకితమిస్తూ మరొకమాటా అన్నారు.

"ఇదినీకై యిడినట్టి నా యుపద ము
న్నేనాడొ ఘూసాగ్రముల్
పదునై ఆంధ్రవిరోధి కంఠదళన
ప్రారంభసంరంభ మే
చు దినాలన్ మరితోడి సైనికులమై
చూరాడు ప్రేమమ్ముతో
నిది లేశమ్మని యైన చెప్పుటకు లే
వే నాటి స్వాతంత్ర్యముల్"

ఆనాటి తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ సి. నారాయణరెడ్డి గారు "కర్పూర వసంతరాయలు" అనే కావ్యాన్ని అంకితమిచ్చారు. సుప్రసిద్ధ చరిత్రకారులు డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్యగారు "మధురతంజావూరు నాయకరాజుల నాటి ఆంధ్ర వాఙ్మయచరిత్ర"ను అంకితమిచ్చారు. నేను "మన లిపి పుట్టుపూర్వోత్తరాలు" అనే గ్రంథాన్ని అంకితమిచ్చి ధన్యత పొందాను. అంకితమివ్వడానికి ముందు పుస్తకం లిఖితప్రతిని ఆయనకు ఆమూలాగ్రం వినిపించాను. ఆయన దాదాపు వారం పాటు శ్రద్ధగా విన్నారు. నేను అహదనకేర శాసనచర్చ మొదలయినవి నా పుస్తకంలో చేర్చాను. "మీరు పాఠకులకు చెప్పదలచుకుంది లిపి పరిణామం గురించి, కనుక నిర్ణయాలు చెప్పండి కాని, వివాదగ్రస్త విషయాలు, వివాదాలు చెప్పకండి. సాధారణ పాఠకునికి దానివల్ల ప్రయోజనం ఉండదు" అన్నారు. వారి సలహా మీద వివాదగ్రస్త విషయాలు తీసివేశాను. "నేను తెలుగు స్వతంత్రలో "ఒక రాయి కథ" అనే శీర్షికలో శాసనాలు, లిపి గురించి ప్రారంభించాను. కాని అది సాగలేదు; ఆగిపోయింది. నా పని మీరు చేశారు" అన్నారు. "మీరు వ్రాసి ఉంటే ఎంతో గొప్పగా ఉండేది" అన్నాను. ఆయన మందహాసం చేశారు.

నేను ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో "మరపురాని మనీషులు" శీర్షిక కింద తెలుగునాట ప్రముఖులను గురించి లేఖినీచిత్రాలు వ్రాస్తూ శర్మగారిని గురించి వ్రాయడానికి నా సహోద్యోగి శ్రీ నీలంరాజు మురళీధర్ గారితోపాటు విశాఖపట్నం వెళ్లాను. అప్పటికే ఆయన ఆస్పత్రిలో అపస్మారకస్థితిలో ఉన్నారు. నిరాశతో తిరిగి వస్తూ, ఆంధ్రపత్రిక వారపత్రికలోని "తెలుగువెలుగు" శీర్షికలో ఏదో కొంత వ్రాశాను గదా అని సంతృప్తి పడ్డాను.

శర్మగారు 1963 జనవరి 7న కన్నుమూశారు. విజ్ఞానంతో మెరసిపోయే ఆ విశాలనేత్రాలు శాశ్వతంగా మూతపడిపోయాయి. పూర్వ భాషిత్వంతో మందహాస మంజులమైన ఆ సుందరముఖం శాశ్వతంగా మౌనముద్ర వహించింది.

శర్మగారు ఆంధ్ర, భారత చరిత్ర, భాషా, వాఙ్మయ, సంస్కృతులకు చెందిన వివిధ విషయాలపై దాదాపు 140 పరిశోధన వ్యాసాలు, శిలాతామ్ర శాసనాలపై 35 పరిశోధన వ్యాసాలు తెలుగులో వ్రాశారు. వివిధ విషయాలపై 28 రేడియో ప్రసంగాలిచ్చారు. ఆంగ్లంలో 19 పరిశోధన వ్యాసాలు వ్రాశారు. ఆంగ్లంలో ఎనిమిది అపూర్వ శాసనాలు ప్రకటించారు. రెండు పుస్తకాలు ఆంగ్లంలోను, తొమ్మిది గ్రంథాలు తెలుగులోను ప్రచురించారు. ఆయన దాదాపు 40 వేల పుటలు వివిధ విషయాలపై వ్రాశారు. ఆయన జీవితకాలం 72 సంవత్సరాలూ (24.12.1891 - 7.1.1963) సార్థకమైనవి.

శర్మగారు ఆంధ్రదేశ చరిత్రను గురించి, దక్షిణాపథ చరిత్రను గురించి, బౌద్ధమత ధర్మ సంస్కృతవాస్తు శిల్పాలను గురించి ఎంతో వ్రాసినా, విష్ణుకుండిన మాధవవర్మ అతని సంతతి, గాంగుల చరిత్ర, పిఠాపుర భీమవర సర్వవర శాసనాలు ఆధారంగా తర్వాతి చాళుక్యుల చరిత్రను అవలోకించి నూతన సిద్ధాంతాలు చేసినా, తెలుగుభాషా సమితి తెలుగు సంస్కృతి సంపుటి ద్వయం ఆయన కీర్తి వైజయంతిగా వెలుగొందినా, నాకు మాత్రం ఆయన తెలుగుచరిత్రకు, తద్వారా దేశచరిత్రకు త్రిరత్నాలు ప్రసాదించిన తథాగతుడుగా దర్శనమిస్తారు.

ఆ త్రిరత్నాలలో మొదటిది "ది హిస్టరీ ఆఫ్ ది రెడ్డీ కింగ్‌డమ్". దీనిని రెడ్డిచరిత్ర సర్వస్వ మనవచ్చును. రెడ్డిరాజుల, రాజన్యుల వంశచరిత్రే కాక ఆనాటి ఆంధ్రప్రజల ఆచార వ్యవహారాలు, మతధర్మాలు, నాగరికతా సంస్కృతులు - సకలం సమగ్రంగా దీనిలో చర్చితం. శర్మగారు ఈ గ్రంథాన్ని రెండుగా విభజించారు. మొదటి భాగంలో ప్రోలయవేమారెడ్డి పాలనతో ప్రారంభమైన కొండవీటిరెడ్డి సామ్రాజ్యం కాలక్రమేణ ఎలా విస్తరించిందో వివరించి దుర్బలుడు, ప్రజాకంటకుడూ అయిన రాచవేమారెడ్డి పాలన కాలంలో గజపతుల వశమైన విషయాన్ని విపులంగా వర్ణించారు. ఇలా మొదటిభాగంలో రాజవంశ చరిత్రను విశదీకరించారు. రెండవభాగంలో శాసనాలను, వాఙ్మయాన్ని, రాయబారుల వ్రాతలను సమగ్రంగా పరిశీలించి, పద్నాల్గవ శతాబ్దంలోని సాంఘిక పరిస్థితులను, సాంస్కృతిక వికాస వైఖరిని విపులంగా చెప్పారు. శ్రీనాథుని హరవిలాసపీఠికలోని దూరప్రాచ్య నౌకా వ్యాపారపు పదాలను గుర్తించారు. జొంకు, సమ్మాను అనే పదాలు జంక్, శంపన్ అనే పదాల వికారాలని, హిమాంబుపదం పని+నీరు= పన్నీరు పదానికి సంస్కృతీ కరణమని చెప్పారు.

రెండవ రత్నం 'ఫర్గాటెన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ" (ఆంధ్రచరిత్రలో విస్మృతాధ్యాయం). కాకతీయరాజ్య పతనానంతరం విజయనగర రాజ్యస్థాపన వరకు జరిగిన ఆంధ్రదేశ చరిత్ర అజ్ఞాతంగా ఉండిపోయింది. శర్మ గారు దానిని పరిశీలించి రెండింటినీ తమ ప్రతిభతో, పరిశోధితాంశ బలంతో కలిపారు. ఇదే ఈ విస్మృతాధ్యాయం. కాకతీయ సామ్రాజ్యం

తురుష్కుల దండయాత్ర వల్ల కుక్కలు చింపిన విస్తరి అయింది. పలువురు కాకతీయ సామంతులు తమపాలికి వచ్చినది పరమాన్నంగా పాలించారు. వారిని ఒక తాటిపై నడిపించినవారు ప్రోలయ నాయకుడు, అతని తమ్ముడు కాపయ నాయకుడూను. కాని వారేననడానికి తగిన ఆధారాలు కనిపించలేదు, చాలా కాలం వరకు. శర్మగారు మొదట 'రెడ్డిరాణి' పత్రికలో (1929) 'నాయకరాజులు-కాపయ నాయకుడు' అనే వ్యాసంలో చూచాయగా చర్చించారు. దీనినే తర్వాత గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రచించిన 'శృంగారశ్రీనాథం'లో ఉదాహరించిన అనితల్లి కలువచేరు శాసనం ఆధారంగా శర్మగారు కొత్త సిద్ధాంతం చేశారు. నాయకరాజులు దేశాన్ని తురుష్క ముష్క రత్వాన్నుంచి కాపాడారని రెడ్డిరాణి పత్రికలోని తమ వ్యాసాన్ని మరికొంత కాలం తర్వాత భారతిలో విశదీకరించారు. ముస్లిం చరిత్రకారులు ఈ కాపయ నాయకుణ్ని కానబా, కాపా, కాబా, కాబానామ్ ఇత్యాదిగా వ్యవహరించారు. 75 మంది నాయకులు కాపయనాయకుణ్ని కొలిచేవారని ఆధారాలు దొరికాయి. కాని ప్రోలయనాయకునికి, కాపయ నాయకునికి సంబంధం ఏమిటి, వారి రాజధాని ఏది, ఎందరు సామంతులు అనే విషయాలు సమస్యలుగా మిగిలాయి. ఇవన్నీ శర్మగారికి విలసతామ్రశాసనం లభించడంతో పరిష్కారమయ్యాయి. ఈ శాసనాన్ని ఆయన భారతిలోను, ఎపిగ్రాఫియా ఇండికా 32వ సంపుటిలోను ప్రచురించారు.

విలస తామ్రశాసనం పదమూడు రేకులది. ప్రోలయ నాయకుడు వెన్నయ పండితునికి కోనసీమలోని విలసగ్రామాన్ని దానమిస్తూ ఈ శాసనం వేయించాడు. ఒక గృహస్థు ఇల్లు కట్టుకొనడం కోసం ఒక నివేశనస్థలాన్ని తవ్వుతుండగా ఇది దొరికింది. ఒక వైశ్యశ్రేష్ఠుడు, కరణం దీనిని పంచుకున్నారు. కరణానికి వచ్చిన భాగంలో ప్రోలయనాయని చరిత్రంతా ఉంది. తక్కిన ఏడురేకుల భాగం దొరకలేదు. శాసనం కావ్యశైలిలో సంస్కృతభాషలో ఉంది. సీమావధులు, పేర్లు తెలుగులో ఉన్నాయి. ఈ శాసన పాఠాన్ని ఆరుభాగాలుగా విభజించవచ్చు. మొదటి భాగంలో దేవతాస్తుతి, రెండవభాగంలో త్రిలింగదేశ వర్ణన, మూడవ భాగంలో కాకతి ప్రతాపరుద్ర వృత్తాంతం, ప్రతాపరుద్రునికి ఢిల్లీ తురుష్కాధిపతి అహమద్ సురత్రాణునికి వైరం, ప్రతాపరుద్రుని పరాజయం, త్రిలింగదేశం యవనాక్రాంతం కావడం, నాల్గవ భాగంలో త్రిలింగదేశంలో తురుష్క పరిపాలనం, తురుష్కుల దురంతాలు, ఐదవ భాగంలో ముసునూరి ప్రోలయనాయకుడు తురుష్కులను జయించి త్రిలింగదేశం స్వాధీనపరచుకొని మరల ధర్మాన్ని స్థాపించడం, ఆరవ భాగంలో ప్రోలయ నాయకుని పరిపాలనలో కోనమండలంలోని విలసగ్రామాన్ని దానమివ్వడం ఉన్నాయి.

ఇతని రాజధాని గోదావరి ప్రాంతంలోని మాల్యవంత పర్వత సమీపాన ఉన్న రేకపల్లి.

ఇది నేటి భద్రాచలం తాలూకాలోని రేకపల్లి. ప్రోలయ కాలక్రమాన తన తమ్ములైన కాపయనాయకుడు మొదలైనవారికి రాజ్యకార్యభారం అప్పగించాడు. ఈ శాసనకాలం క్రీస్తుశకం 1325-1326 మధ్య అయి ఉంటుందని శర్మగారు నిర్ణయించారు. తక్కిన ఏడు రేకులూ లభించి ఉంటే మరికొన్ని అపూర్వ చారిత్రకాంశాలు లభించేవేమో! ఆ రేకులు ఆ వైశ్యపుంగవుని ఇంట్లో కాగులు పళ్లేలు, చెంబులు అయి వుంటాయి. ఇంతవరకు దొరికిన రేకులను బట్టే విస్మృత చరిత్రాంశంలోని భాగాలను కలుపడానికి, తెగిపోయిన చరిత్ర సూత్రాలను ముడివేయడానికి శర్మగారు కృషి చేసి కృతార్థులయ్యారు.

మూడవరత్నం మొగల్రాజపురం గుహలలోని అర్ధనారీశ్వర విగ్రహం. దీనిని గురించి శర్మగారు "ది ఎర్లీ అర్ధనారీశ్వర ఇమేజ్ ఫ్రమ్ మొగల్రాజపురం" అనే శీర్షికతో 'జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ అండ్ కల్చర్' రెండవ సంపుటి మొదటి సంచికలో ప్రచురించారు.

మొగల్రాజపురం గుహలు మొత్తం ఐదు. వీటిలో మూడవదానిలో ఈ అర్ధనారీశ్వర విగ్రహం ఉత్కీర్ణమయి ఉంది. గోపీనాథరావుగారు "అర్ధనారీశ్వర విగ్రహం మన వాస్తుశిల్పాలలో తొలిసారిగా కనిపిస్తున్నది బాదామి గుహలలో" అని అన్నారు. మొగల్రాజపురం గుహలలో కానవచ్చే అర్ధనారీశ్వర విగ్రహం విష్ణుకుండినుల కాలందని, ఈ అసమగ్ర అస్పష్ట గుహాలయాలే తర్వాత బాదామి, పల్లవ గుహాలయాల సుస్పష్ట సుందర విగ్రహాలకు మార్గదర్శకాలని శర్మగారు సిద్ధాంతీకరించారు. ఈ ఉత్కీర్ణశిల్పం క్రీస్తుశకం ఐదవ శతాబ్దంది. దీనిని సంస్కృతంలో లయనం, ప్రాకృతంలో వేణలి అనేవారు. ఈ సిద్ధాంతంలో విష్ణుకుండినులకు ముందునుంచే వైదిక మతానికి ఆంధ్రదేశంలో ఆదరం, అది శిల్ప వస్తువులలో ప్రతిబింబించడం స్పష్టమైంది.

విజయనగర సామ్రాజ్య స్థాపకులైన హరిహరరాయలు, బుక్కరాయలు ఆంధ్రులు కారని, కర్నాటకులని చరిత్రకారుడు హీరాస్ "బిగినింగ్స్ ఆఫ్ విజయనగర హిస్టరీ" అనే గ్రంథంలో చేసిన సిద్ధాంతాన్ని డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య గారు ఖండించడానికి శర్మగారి "ఎ ఫర్గాటెన్ ఛాప్టర్ ఆఫ్ ఆంధ్ర హిస్టరీ" ఎంతగానో ఉపయోగపడింది.

కొన్ని సంవత్సరాలపాటు ప్రముఖ చరిత్రకారుల, శాసన పరిశోధకుల దృష్టిని ఆకర్షించిన అహదనకర శాసనం చర్చను కొద్దిగా ప్రస్తావించడం అవసరం. ఈ శాసనం మొదట సంస్కృతమని, తర్వాత తమిళ అని భావించారు. శాసనకాలం లేనందున ఇది సరైన శాసనం కాదని బర్గెస్ అనుమానించారు. సంస్కృతశాసనాలలో సీమాచిహ్నాలు, పేర్లు, కొలమానాలు మాత్రం తెలుగులో ఉండడం పరిపాటి. కాని, పదవ శతాబ్దికి ముందున్న సంస్కృత శాసనాలలో తెలుగుభాగమున్న శాసనం ఇదొక్కటే. క్రీస్తు శకం 714-751 మధ్య చెక్కినట్టిది ఈ శాసనమని లిపి శాస్త్రజ్ఞులు భావించారు. లక్ష్మణరావుగారు దీనిని పరిశీలించి తెలుగని నిర్ణయించారు,

విశ్లేషణకు ప్రయత్నించారు. అంతలో అకాలమృత్యువు వాతపడ్డారు. తర్వాత శర్మగారు దీనిని విడదీయడానికి ప్రయత్నించారు. ఆయనా అస్తమించారు. శాసనం పూర్తిగా అర్థం కాకనే ఉండిపోయింది.

ఈ అహదనకరశాసనం తెలుగుభాగాన్ని శర్మగారు రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక (1922)లో "ప్రాణరీనాంధ్ర భాషాస్వరూపము" అనే వ్యాసం చివర ఇచ్చారు. దానిని గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు కొంత పరిష్కరించి 1924లో భారతిలో ప్రచురించారు. దానిపై వాదోపవాదాలు చెలరేగాయి. వాదమంతా ఒక్కుమ్మడిగా నేడు తమిళంలో ఉంటూ తెలుగు కన్నడాలలో లుప్తమైపోయిన ళ్ల, బండిఱ అనే అక్షరాల జిజ్ఞాసపై విరుచుకుపడింది. ఈళ్ల అన్న వర్ణం పన్నెండవ శతాబ్దికి ఈవల కానరాదని, తెలుగులో డ గాను, కన్నడంలో ళ గాను మారిందని శర్మగారి వాదం. ళ్ల (ఌ), ఱ (బండిర) రెండు సున్నలు పక్కన పక్కన అమర్చినట్లు వ్రాసే గుర్తులతో ఏర్పడినవైనా, ఌ అంతరించిపోయింది; ఱ చాలచోట్ల పన్నెండవ శతాబ్దికి ఈవల కూడా కనిపించిందని శర్మగారు వివరించారు. ఈఌ పోట్లదుర్తి మాలెపాడు శాసనంలో రెండు సున్నలు ంం పక్కపక్కన నిలబెట్టినట్టు, రెండు సున్నలు నిలువుగా 00 పక్కపక్కన నిలబెట్టినట్టు ఉన్నవని, శకటరేఫ ఱ ఏడవ శతాబ్దానికి ముందే కన్నడంలోను ప్లస్+గుర్తు వేసి దానిచుట్టూ సున్నచుట్టినట్టు⊕, రెండు కోడిగుడ్లు నిలబెట్టి మధ్యన నిలువుగీత పెట్టినట్టు 0|0, తలకట్టు లేని ద వ్రాసి దాని మధ్యన ప్లస్ గుర్తు ⊕ పెట్టినట్లు, బండిచక్రాలలాగ రెండు సున్నలు విడిగా వ్రాసి, వాటిని అడ్డుగీతతో కలిపినట్టు ఱ, ఱ ⊕ ⊕ ⊖ ఌ, ఱ ఈ విధంగా వివిధ స్వరూపాలలో ఉన్నా, ప్రధానాంశం శకటరేఫ స్వరూపం ఇరుసు వంటి అడ్డుగీత అన్నిటా ఉండడమని శర్మగారి వాదం సారాంశం. నాకు ఈ చర్చలో ఆశ్చర్యం కలిగించిన విషయం శర్మగారి వాదపటిమ. ఆయన వాదంలో బలం ఉదాహరణలను గుప్పించడం.

శాస్త్రిగారు ఈ వింత అక్షరాన్ని డ గా చదివారు. ఇది డ కాదు ఌ; ఇది క్రమంగా డ గా పరిణమించిందని అనడానికి శర్మగారు దాదాపు 30 శాసనోదాహరణలు చూపారు. శకటరేఫఱ వ్రాత తీరు ఎలా ఉన్నా, ప్రధాన లక్షణాలు మారలేదని, ళ్ల-ఌ కూడ యథారీతిగానే ఉందని శర్మగారు వాదిస్తూ ॥ ⊕ శకటరేఫ ఏడవ శతాబ్దానికి ముందు నుంచే కన్నడంలో ఉంది. బర్నెల్ సిద్ధపరచిన పశ్చిమ చాళుక్యాక్షరాలలో ఇది ఉంది" అంటూ తొమ్మిది కారణాలు చెప్పి ఱతో ఉండే పదాలు, ఌతో ఉండే పదాలు ఇచ్చారు : చిఱుంబూరు, ఆచాఱు, శ్రీకఱువారి అచఱు, శత్యాదిత్యన్టు, పఱుచున్టి, నేవాన్టు, వచ్చువాన్టు, కన్టేఱవాటి విషయం, ఌచ్చినవాన్టు, తాఱుమున్టి, ఌచ్చువాన్టు, ఏఱువాన్టు, విన్టినాయకున్టు, చేయి(?)చ్చినవాన్టు, మీగన్టు, మున్టు,

ముదిగొన్న ఇత్యాది ప్రయోగాలను సత్యాదిత్య, చోళమహారాజ, ప్రథమ జయసింహవల్లభ, వైదుంబ, చోళ, విక్రమాదిత్య, విష్ణువర్ధనాదుల శాసనాల నుంచి, ముదివేడు, బుదమనరాయలపాడు, వెట్లూరు మున్నగు ఊళ్లలో దొరికిన శాసనాల నుంచి ఉదాహరించారు. ఇది శకటరేఫే కాని డగా చదువరాదని, ద కారం స్పష్టంగా ఉన్న పెరుమాడ్లు, దేవడ్లు వంటి అపూర్వ ప్రయోగాలు చూపారు.

ఇన్ని ప్రమాణాలు చూపినా, తప్పులుంటే ఒప్పుకొనడానికి జంకనని తరచు అనేవారు. ఇది ఆయన సరసత. ఇది అహదనకర శాసనం ప్రతి విమర్శలోను కానవచ్చేది. కఱ్ఱు అనగా గట్టు అని అర్థము. ఏటికఱ్ఱు, కోటికఱ్ఱు ఇత్యాదులు. కఱుత అనునది ఈ పదము యొక్క సప్తమ్యేక వచనరూపము. రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికలో పొరపాటుగ కఱుత అనుదానిని నేను ప్రథమావిభక్తి రూపముగ గ్రహించి, దానికి గట్టు అని అర్థము చెప్పియున్నాను. ఇది తప్పు. కఱ్ఱు ప్రథమావిభక్తి రూపము. కఱుత సప్తమీ విభక్తిరూపము" అని అధస్సూచికలో తెగవేసి చెప్పారు శర్మగారు.

శర్మగారు మనదురదృష్టవశాత్తు చిన్ననాడే ప్రాథమిక పాఠశాలలోపాధ్యాయులయి ఉంటే, ఏ హెడ్‌మాస్టరుగానో రిటైరయ్యేవారేమో! సబ్ రిజిస్ట్రారు కార్యాలయంలో గుమాస్తాగా అయివుంటే, మహా అయితే సబ్‌రిజిస్ట్రారు అయ్యేవారేమో! జాతీయోద్యమంలోనే ఉండి ఉంటే రాజకీయ రంగంలో పెద్ద పేరే వచ్చేదేమో! కాని మన అదృష్టం - ఆంధ్రుల అదృష్టం బాగుంది. ఆయన సర్కారు నౌకరీ దాస్యంలో పడకుండా చరిత్ర రంగంలో పడ్డారు. తాము కొవ్వొత్తిలాగ హరించుకుపోయినా తెలుగుజాతికి వెలుగునిచ్చారు. తాము చందన కాష్ఠం వలె అరిగిపోయినా విజ్ఞానవాసనలను దిగంతాలకు వెలార్చారు. ఆయనకు నా కైమోడ్పు.

# అనుబంధం :

## 1. పరిశోధన వ్యాసాలు (చరిత్ర సంస్కృతి)

| | | | |
|---|---|---|---|
| 1. | ఆంధ్రవీరులు-వీరసప్తకము | ఆం.సా.ప.ప. | 1920 |
| 2. | రాజరాజనరేంద్రుడు | రాజ.పట్టా. | 1922 |
| 3. | ప్రాచీనాంధ్ర భాషాస్వరూపము | " | 1922 |
| 4. | రెండవ ప్రతాపరుద్రుని పరిపాలన విధానము | ఆం.ప.ఉ.సం. | 1922 |
| 5. | భ్రమరప్రబోధము (గేయములు) | శారద, ఏప్రిల్ | 1923 |
| 6. | హిందూ దేవాలయములు | " | 1923 |
| 7. | శ్రీకృష్ణ దేవరాయల పరిపాలము | " | 1923 |
| 8. | శాసనములు : తటాకములు | ఆం.ప.ఉ.సం. | 1923 |
| 9. | ఆంధ్రమాత (ప) | శారద | 1923 |
| 10. | ప్రణయలీల (ప) | భారతి, జనవరి | 1924 |
| 11. | వేంగీచాళుక్యులు | " మార్చి | 1924 |
| 12. | ప్రకృతి ఏకాంతవాసము | సా.సర్వ. | 1924 |
| 13. | బ్రాహ్మణుడు : నాడు, నేడు | భారతి, జులై | 1924 |
| 14. | హిందూదేశ వర్తకవ్యాపారము | " సెప్టెం | 1924 |
| 15. | శరన్నవరాత్రములు | " అక్టో | 1924 |
| 16. | శాసనములు-చరిత్ర | ఆం.ప.ఉ.సం. | 1955 |
| 17. | వేంగీ చాళుక్యులు | భారతి, ఏప్రిల్ | 1925 |
| 18. | వేంగీ చాళుక్యులు | " సెప్టె | 1925 |
| 19. | మన ప్రాచీన విద్యాసంస్థలు | ఆం.ప.ఉ.సం. | 1926 |
| 20. | మన ప్రాచీన వృత్తి విద్యావిధానము | భారతి, మార్చి | 1926 |
| 21. | వేంగీ చాళుక్యులు | " డిసెం | 1926 |
| 22. | గోలుకొండ కుతుబ్‌షాహీ వంశము | " జన | 1927 |
| 23. | ప్రాచీన హిందూగ్రామ పరిపాలనము | ఆం.ప.సం.ఉ. | 1927 |
| 24. | ఆంధ్ర మహాసామ్రాజ్యము-రాజులకాలనిర్ణయ సమస్య | భారతి, మార్చి | 1927 |
| 25. | శ్రీకృష్ణదేవరాయలనాటి రెండు బంగారు నాణెములు | భారతి, మార్చి | 1927 |

| | | | |
|---|---|---|---|
| 26. | ఆంధ్రమహాసామ్రాజ్యము-I | భారతి, ఏప్రిల్ | 1927 |
| 27. | ఆంధ్రమహాసామ్రాజ్యము-II | భారతి, మే | 1927 |
| 28. | ఆంధ్ర మహాసామ్రాజ్యము-III | భారతి, జూన్ | 1927 |
| 29. | వెలనాటి చోళవంశావళి-కేయూర బాహుచరిత్ర | భారతి, అక్టో | 1927 |
| 30. | కళింగ గంగవంశ చరిత్ర (కొన్ని సమస్యలు) | సుభాషి, నవం | 1927 |
| 31. | ఆంధ్రదేశము-తటాకములు | భారతి | 1928 |
| 32. | విన్నకోట పెద్దనకాలము | భారతి, సెప్టెం | 1928 |
| 33. | నా నెల్లూరు మండలయాత్ర | భారతి, సెప్టెం | 1928 |
| 34. | నా నెల్లూరు మండలయాత్ర | భారతి, నవం | 1928 |
| 35. | చిత్రకారుడు (గే) | భారతి, మార్చి | 1929 |
| 36. | కళింగ కదంబులు | భారతి, మార్చి | 1929 |
| 37. | నాయకరాజులు-కాపయనాయకుడు | రెడ్డిరాణి, మే | 1929 |
| 38. | రెడ్డిరాజుల ధర్మకార్యములు | రెడ్డిరాణి, మే | 1929 |
| 39. | రెడ్ల పుట్టుపూర్వోత్తరాలు | రెడ్డిరాణి, మే | 1929 |
| 40. | పెమ్మసాని వీరతిమ్మానాయుడు | భారతి, అక్టో | 1929 |
| 41. | ప్రాచీన రాజ్య పరిపాలనము | జయంతి, సం1 | 1930 |
| 42. | బౌద్ధవాఙ్మయము : పరిశోధన | భారతి, ఏప్రిల్ | 1930 |
| 43. | కాపయనాయకుడు | భారతి, జూన్ | 1930 |
| 44. | ఆయుర్వేదము : అప్పుడు, ఇప్పుడు | సుధ | 1930 |
| 45. | అచ్యుతప్ప నాయకుడు | భారతి, డిసెం | 1932 |
| 46. | కడపటి పల్లవుల కాలనిర్ణయ సమస్య | భారతి, మే | 1933 |
| 47. | సిద్ధవటము కోటపతనము | ప్రబుద్ధాంధ్ర, ఫిబ్ర | 1934 |
| 48. | వాతాపి చాళుక్యులు | భారతి, మార్చి | 1934 |
| 49. | కళింగ గాంగశకము I | భారతి, డిసెం | 1934 |
| 50. | కళింగగాంగశకము II | భారతి, డిసెం | 1934 |
| 51. | రెడ్డియుగము : ఆంధ్రవాఙ్మయము | ఉదయిని | 1934 |
| 52. | విజయనగర సామ్రాజ్యముల పుట్టుపూర్వోత్తరాలు | భారతి | 1934 |

పుస్తక సమీక్ష

| | | | |
|---|---|---|---|
| 53. | అఖిల భారత సారస్వత పరిషత్తుకి మనం దూరంగా ఉండాలి | ప్రబుద్ధాంధ్ర | 1935 |
| 54. | చిలుకూరు వీరభద్రరావు పంతులుగారు | ప్రబుద్ధాంధ్ర, అక్టో | 1935 |
| 55. | కాకతీయులు:కళింగము | కాకతిసం | 1935 |
| 56. | రెడ్డిరాజుల కాలపు చాటుసీసము | ఆం.ప.సం. | 1936 |
| 57. | గాంగులు : కళింగము | భారతి, జూన్ | 1936 |
| 58. | చరిత్ర అంటే....! | వీణ | 1936 |
| 59. | వడ్డవారము | భారతి, జులై | 1936 |
| 60. | హైదరాబాద్ ఆంధ్రులు | భారతి, మార్చి | 1937 |
| 61. | హైదరాబాద్ ఆంధ్రులు | భారతి, ఏప్రిల్ | 1937 |
| 62. | వార్తాపత్రికలు | ఆం.ప.ఉ.సం. | 1937 |
| 63. | విజయనగర సామ్రాజ్యము-దాని ఉదయ ప్రశస్తులు | భారతి, నవం | 1937 |
| 64. | నాగార్జునకొండ | ఆం.ప.ఉ.సం. | బహుధాన్య |
| 65. | ప్రజాహితైకజీవి | భారతి, మే | 1938 |
| 66. | స్వదేశ సంస్థానములు | భారతి, డిసెం | 1938 |
| 67. | వాయంగ్ ఆటలు-జావాద్వీపవాసుల వినోదములు | ఆం.ప.ఉ.సం. | 1939 |
| 68. | అనాదృత వాఙ్మయము | ఆం.ప.ఉ.సం. | 1939 |
| 69. | గోలీ శిల్పములు | ఆం.ప.ఉ.సం. | 1939 |
| 70. | అశ్రుతర్పణము (కీ.శే.గి.వేం.రామమూర్తి పంతులుగారి నిర్యా.సం.) | ప్రతిభ | 1940 |
| 71. | సుప్రయోగానది ఏది? అది ఏ నామముతో వ్యవహరింపబడుచున్నది? - పెన్న | ఆం.ప.ఉ.సం. | 1940 |
| 72. | శివలెంక కొమ్మనామాత్యుడు | శాంతి (వా.ప) | 14.8.1940 |
| 73. | గౌరీనమంత్రి, సింగయమాధవుడు | మ.సూ.శా.ష.సం. | 1941 |
| 74. | ఆంధ్ర | ఆంధ్ర, అక్టో | 1941 |
| 75. | బ్రాహ్మణ శాఖాభేదములు-కొన్ని నాడులు | స.సా.అ.వేం.స.సం | 1942 |
| 76. | మధ్యయుగ ఆంధ్రదేశము-సంగీత నాట్యాభివృద్ధి | ఆం.స.ఉ.సం. | 1942 |
| 77. | చందవోలు రాజధానిగా నున్నప్పుడు | భారతి, జులై | 1944 |

78. కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు — భారతి, ఆగస్టు 1944
79. నాగార్జునకొండ శిల్పములు — భారతి, నవం 1944
80. పాల్కురికి సోమనాథుని కాలము — భారతి, ఫిబ్ర 1945
81. ఆంధ్రభారతావతరణము — ప్రతిభ, ఏప్రి 1945
82. ముక్త్యాల సంచిక (అధ్యక్షోపన్యాసము) — ప్రతిభ, అక్టో 1945
83. కొఱవి గోపరాజు — మా.హ.ష.సం. 1946
84. మనమూ-మన ప్రపంచమూను — భారతి, సెప్టెం 1946
85. మన చరిత్ర సామగ్రి-చరిత్రాను శాసనాలలోని వింత విశేషాలు — భారతి, ఫిబ్ర 1947
86. పుణ్యస్మరణ-(కాశీనాథుని) నాగేశ్వరరావు — భారతి, ఏప్రిల్ 1947
87. మన ప్రాచీన వర్తకసంఘములు: వజ్రబైషిక — భారతి, జులై 1947
88. పరివర్తనము — భారతి, నవం 1947
89. అనంతామాత్యకవి — భారతి, డిసెం 1947
90. క్రీ.శం. 1697లో విజయనగరము (Fr. Rubino Mission) — భారతి, జన 1948
91. ఆంధ్రవాఙ్మయ చరిత్ర : అజ్ఞాతయుగము — సమత, జులై 1948
92. జక్కనకవి కాలము — భారతి, సెప్టెం 1948
93. బౌద్ధసంఘము — కిన్నెర సం.1 1948
94. ఆంధ్రదేశపునాడులు:శాఖాభేదములు — కిన్నెర, మే 1949
95. నాగశిల్పి (నాటిక) — భారతి, జూన్ 1949
96. భారతికి జోహార్లు — భారతి 1949
97. బౌద్ధమత పరిణామము — భారతి, జన 1950
98. ఆంధ్రులు : సంస్కృతి — ఆం.ప.ఉ.సం. 1950
99. బౌద్ధకళారంభములు-బార్హుత్‌స్తూపము — ఆం.ప.ఉ.సం. 1951
100. కులములు-కులసంఖ్యలు — భారతి, మే 1951
101. తెలంగాణా చరిత్ర — సుజాత, ఆగ 1951
102. ఒక చాటు సీసమాలిక — భారతి, సెప్టెం 1951
103. రేచర్ల వెలమప్రభువులు:వారి సాహిత్యసేవ — ఆం.ప.ఉ.సం. 1952

| | | | |
|---|---|---|---|
| 104. | చారిత్రక శతకములు:భద్రగిరి శతకము | భారతి, ఆగ | 1952 |
| 105. | మహారాష్ట్ర భూపతులు:ఆంధ్రసాహిత్యము I | భారతి, డిసెం | 1952 |
| 106. | వ్యవహారభాషోద్యమము | కిన్నెర, మార్చి | 1953 |
| 107. | మహారాష్ట్ర భూపతులు:ఆంధ్రసాహిత్యము II | భారతి, జన | 1954 |
| 108. | యూరోపియనుల ఆంధ్రభాషా చరిత్ర సేవ | భారతి, అక్టో | 1954 |
| 109. | తథాగతుని దంతధాతు చరిత్ర | ఋ.జ.మ.సం. | 1956 |
| 110. | ఆంధ్రదేశములోని బౌద్ధ సంప్రదాయాలు | పరిశోధన, ఏప్రి | 1956 |
| 111. | బౌద్ధసంస్కృతి | భారతి, మే | 1956 |
| 112. | త్రిలోచన పల్లవుడు | భారతి, జూన్ | 1956 |
| 113. | చరిత్రపాఠాలు | గు.మం.స. | 1959 |
| 114. | మాధవవర్మ : అతని సంతతి I | భారతి, మే | 1959 |
| 115. | మాధవ వర్మ : అతని సంతతి II | భారతి, జూన్ | 1959 |
| 116. | మాధవవర్మ : అతని సంతతి III | భారతి, జులై | 1959 |
| 117. | మాధవవర్మ : అతని సంతతి IV | భారతి, ఆగస్టు | 1959 |
| 118. | గురజాడ చరిత్ర పరిశోధన | గు.శ.జ.సం. | 1962 |
| 119. | ఆంధ్రకవుల ఛాయాచిత్ర ప్రదర్శనము (మరణానంతరం ప్రచురితం) | వైశాఖి | 1970 |
| 120. | తెలుగుబావుటా మరల ఎగిరింది | సౌభాగ్య | |
| 121. | కంబాలతోట | సౌభాగ్య | |
| 122. | రాణిమీనాక్షి-మధుర ఆంధ్రనాయక రాజ్యాస్తమయము | సౌభాగ్య | |
| 123. | మన బౌద్ధశిల్పకళా నిక్షేపాలు | సౌభాగ్య | |
| 124. | జాతక గ్రంథములు:భద్దంత జాతకము | సౌభాగ్య | |
| 125. | 19వ శతాబ్దం | | |
| 126. | సీతమ్మ శోకము | | |
| 127. | గ్రామరక్షణము | | |
| 128. | మూర్తిశిల్పము:బౌద్ధయుగము | | |
| 129. | రణము కుడుపుట : బొమ్మ వెట్టుట | మాతృసేవ ఉగాది సంచిక | |
| 130. | భారతీయ నాటకము : పుట్టు పూర్వోత్తరాలు | నాట్యకళ | |

131. మాండలికయుగము : శాసనకావ్యము సురభి
132. తెలుగు సాహిత్యంలో వెన్నెల వైభవం తెలుగుతల్లి
133. ఆంధ్రదేశంలోని బౌద్ధ నిర్మాణావశేషములు భారతి

## 2. శాసన పరిశోధన వ్యాసాలు

| | | | |
|---|---|---|---|
| 1. | శాలంకాయన నందివర్మ పెదవేగి శాసనము | భారతి, ఆగ | 1924 |
| 2. | మూడవ విష్ణువర్ధనుని గణపవరం తామ్రశాసనము | భారతి, సె. | 1924 |
| 3. | మూడవ వజ్రహస్తుని చిక్కల వలసతామ్రశాసనము | భారతి, డిసెం | 1924 |
| 4. | మొదటి జయసింహవల్లభుని నిడమఱ్ఱు తామ్రశాసనము | భారతి, మే | 1925 |
| 5. | మూడవ వజ్రహస్తుని బొడ్డపాడు తామ్రశాసనము (శ.982) | భారతి,మే | 1926 |
| 6. | సదాశివరాయల కొల్లిపఱ తామ్రశాసనము (శ.1465) | భారతి,జూలై | 1926 |
| 7. | సదాశివరాయల కొల్లిపఱ తామ్ర శాసనము (మూలము) | భారతి, ఆగ | 1926 |
| 8. | దేవేంద్రవర్మ కంబకాయ శాసనము | భారతి, నవం | 1927 |
| 9. | వినయాదిత్యుని కర్నూలు శాసనము | భారతి, డిసెం | 1927 |
| 10. | గోకర్ణదేవచోడుని శిలాశాసనము | భారతి, జన | 1928 |
| 11. | నన్నయకు పూర్వం తెలుగు శాసనములు | భారతి, మార్చి | 1928 |
| 12. | ధర్మవరం శాసనములు | భారతి, ఏప్రిల్ | 1928 |
| 13. | అహదనకరశాసనము (విమర్శము) | భారతి, అక్టో | 1928 |
| 14. | అశోకుని శిలాశాసనములు:రాయలసీమ | భారతి, సెప్టెం | 1929 |
| 15. | నాగాయి శాసనము | భారతి, మార్చి | 1930 |
| 16. | అరికేసరి కొల్లిపర శాసనము | భారతి, ఆగస్టు | 1930 |
| 17. | పోట్లదుర్తి మాలెపాడు శాసనము | గి.వేం.రా.స.సం. | 1932 |
| 18. | హస్తివర్మ నర్సింగపల్లి తామ్రశాసనము | భారతి, సెప్టెం | 1934 |
| 19. | ఒక కొత్త శాసనము | ఆం.ప.ఉ.సం. | 1934 |
| 20. | మూడవ వజ్రహస్తుని గంజాం శాసనము | భారతి, ఫిబ్ర | 1935 |
| 21. | వినయాదిత్యుని మయలూరు శాసనము | భారతి, ఏప్రిల్ | 1936 |
| 22. | గాంగసామంతవర్మ నూతన శాసనము | భారతి, ఫిబ్ర | 1937 |

| | | |
|---|---|---|
| 23. | కోనమన్మమల్లభూపతి కందికుప్ప శాసనము | భారతి, జూన్ 1939 |
| 24. | నన్నయకు పూర్వపు ఆంధ్రశాసనములు | ఆం.ప.ఉ.సం. 1941 |
| 25. | మాచానాయకుని ఉమామహేశ్వర శాసనము | మ.సూ.నా.శా.ష.సం. 1941 |
| 26. | రావు మాధవరావు భార్య నాగాంబిక నాగారము శాసనము | మ.సూ.నా.శా.ష.సం. 1941 |
| 27. | మూడవ విజయాదిత్యుని సీసలి తామ్ర శాసనము | భారతి, ఏప్రి 1946 |
| 28. | మొదటి జయసింహవల్లభుని మాచెర్ల శిలాశాసనము | భారతి, ఏప్రి 1947 |
| 29. | మొదటి చాళుక్యభీముని సీసలి తామ్ర శాసనము I | భారతి, మార్చి 1948 |
| 30. | మొదటి చాళుక్యభీముని సీసలి తామ్ర శాసనము II | భారతి, ఏప్రిల్ 1948 |
| 31. | ముసునూరి ప్రోలయ నాయకుని విలస తామ్ర శాసనము | భారతి, మార్చి 1952 |
| 32. | కారెంపూడి శిలాశాసనము | భారతి, డిసెం 1954 |
| 33. | ఎఱ్రమందభూపతి చేబ్రోలు శాసనము | భారతి, నవం 1959 |
| 34. | ఒక రాయి కథ | స్వతంత్ర వా.1 సం.39 |
| 35. | రొజెట్టా శిల ప్రాముఖ్యం | స్వతంత్ర వా.1 సం.40 |
| 36. | చిత్రలిపి సమస్యా పరిష్కారం | స్వతంత్ర వా.1 సం. 42 |

## 3. రేడియో ప్రసంగాలు

| | | |
|---|---|---|
| 1. | ప్రాచీన విశ్వవిద్యాలయాలు | |
| 2. | గురుకుల పద్ధతి | |
| 3. | మన విద్యాలయాలు | |
| 4. | ఆలయనిర్మాణము - ఆలయములు | |
| 5. | నృత్తరత్నావళి | |
| 6. | నగరముల పుట్టు పూర్వోత్తరాలు | తిరువనంతపురం |
| 7. | నగరముల పుట్టు పూర్వోత్తరాలు | తిరుచిరాపల్లి |
| 8. | నగరముల పుట్టు పూర్వోత్తరాలు | మైసూరు |
| 9. | నగరముల పుట్టు పూర్వోత్తరాలు | ఓరుగల్లు |
| 10. | నగరముల పుట్టు పూర్వోత్తరాలు | హైదరాబాదు |

11. నగరముల పుట్టు పూర్వోత్తరాలు రాజమహేంద్రవరము
12. అశోకుని జౌగడ శాసనము
13. ప్రాచీనాంధ్ర సముద్రక వ్యాపారము
14. అహల్యా సంక్రందన విలాసము
15. కడప నవాబులు
16. హిందూదేశ దారిద్ర్యము
17. యాదవులు-వారి గాథలు
18. రాయలసీమ
19. తలకంటీశ్వర దేవస్థాన వృత్తాంతము
20. సాతవాహనులు
21. పల్లవులు
22. ఆంధ్ర చారిత్రకౌన్నత్యము
23. భాషాసేవ, పాశ్చాత్యులు : క్యాంప్‌బెల్ చేసిన సేవ
24. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము - 12 ప్రసంగాలు
25. ఆంధ్రసంస్కృత తరంగిణి - 12 ప్రసంగాలు
26. అభినవాంధ్ర నిర్మాతలు : కందుకూరి వీరేశలింగము
27. అభినవాంధ్ర నిర్మాతలు : కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు
28. అభినవాంధ్ర నిర్మాతలు : కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు

## 4. RESEARCH ARTICLES

1. Indrabhattaraka and Ganga Era — J.A.H.R.S. Vol V 1930
2. The Cronology of the later Pallavas — G.V.R. / Fel Vol. 1932
3. A note on Mandasa Plate of Anantavarmam — J.A.H.R.S. VolXII 1938
4. A note on the Panchadharla Pillar inscription of King Visveswara — E.T.XXV. 1939-40
5. A study of the grants of Early Gangas — J.A.H.R.S. Vol. II XIII 1940
6. Prithvipati, Varaguna and Aparajita — JOR Vol IX

7. The chronalogy of the Sultans of Gulbarga JBORS 1941
8. A note on "Dasasatasakala Darani tale" mentioned in the Telugu Academi Plates of Vishnukundin Madhavavarma J.O.R. Vol XI 1942
9. Early members of the Recharla Family of Pillalamarri Jr. A.H. and C Vol 1 1943
10. An Early Ardhanareswara image from Mogalrajapuram Jr. A H and Vol II 1944
11. Koppula Chiefs Jr. A.H. and C Vol II 1944
12. A note on Pagunara Vishaya J.O.R. Vol XVI 1946
13. South Indian influences in the far East (Book Review) JOR XVIII 1948
14. Saiva devotional literature refered to in Panditaradhya Charitra JOR Vol XXIII 1954

## 6. ముద్రిత గ్రంథములు

1. Forgotten Chapter of Andrha History
2. History of Reddi Kingdom
3. చారిత్రక వ్యాసములు
4. అమరావతి స్తూపము - ఇతర వ్యాసములు
5. ఆంధ్రవీరులు
6. దేశోద్ధారకులు
7. ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము
8. రేడియో నాటికలు రెండు భాగములు
9. రోహిణీచంద్రగుప్తము (నవల)
10. రాగతరంగిణి (నవల)

హిందూదేశ చరిత్ర

## అనుబంధము - 1

# నవ్యాంధ్ర విద్వన్మహాపురుషులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

**- ఇవటూరి కామేశ్వరరావు**

ఎందరో మహానుభావులు అందరికిని వందనములు అనునట్లు నా మేనమామగారైన స్వర్గీయ శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిని ఈ పుణ్యదినమున మరల నొకపరి సంస్మరించి వారికి నా నమోవాకము లర్పించుట నా విద్యుక్తధర్మము.

మదరాసులో వారు ఆంధ్రపత్రికా కార్యాలయమున 'భారతి'యందు పనిచేయుచున్న రోజులవి. 1936 సంవత్సరమున నేను మద్రాసు వెడలి ఆదెప్ప మొదలివీధియందు వారి యింట నుండి నా విద్యాభ్యాసము గడపిన దినములు నేనెప్పటికిని మరువలేను. మదరాసు క్రిష్టియన్ కాలేజీ హైస్కూలునందు నన్ను జేర్పించి నా యోగక్షేమములను విచారించుచు ఎంతో ప్రేమోదర వాత్సల్యములు జూపి కంటికి రెప్పవలె కాపాడిన పరమ దయాశీలురు, సౌజన్యమూర్తులు వారు. అప్పుడు నేనును, మా అన్నయ్యగారును, మా చిన్నమామయ్యగారును గూడ అక్కడనే ఉంటూ ఆ స్కూలునందే చదువుకొనుచుంటిమి. వారివద్ద నుండి విద్యనభ్యసించుట నా భాగ్యవిశేషము.

ఆ రోజులలో వారియింట కీ.శే. కొంపెల్ల జనార్ధనరావుగారును, కీ.శే.వేలాల సుబ్బారావు గారును, ఇంకను చావలి బంగారమ్మగారును ఉండెడివారు. వీరేకాదు అనుదినము వచ్చిపోవు కవులు, పండితులు, మిత్రులెందరో నా స్మృతి పథమునందు మెలగుచున్నారు. ఆయా సమయములందు వచ్చెడివారిని తగురీతి గౌరవించి వారి సంశయములను దీర్చుటకై మామయ్యగారు ప్రయత్నించుచుండుట, కొత్త విషయముల నాసక్తితో దెలిసికొనుట, పూర్వాంధ్ర రాజవంశపు భూమీశుల శాసనముల బరిష్కారమును గూర్చి తర్కించుట, మరుగునపడి క్లిష్టతరమైనట్టియు, సంశయాత్మకములైనట్టియు ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్రాంశములను గూర్చి సంప్రదించుట, అసమగ్రమై చెల్లా చెదురుగా వున్న ఆంధ్రుల చారిత్రక విశేషములను ప్రోదిచేసి వాటికి సంపూర్ణ రూపమునిచ్చుటకై వారహోరాత్రము నిద్రాహారములను సైతము తృణీకరించి సత్యమును వెదకిపట్టి వెలికి తీయవలెననెడి వారి అకుంఠిత దీక్ష, ఎంతయో ఓపికతో సహనముతో సుదీర్ఘముగ జరిపెడు వారి చర్చలు, సన్నివేశములు నా మనోవీధియందు నేటికిని హత్తుకుపోయి యున్నవి. వారు చిరుతప్రాయమునుంచి నిబిడీకృతమై ఉన్న ఆత్మశక్తిని గుర్తించిన ప్రతిభాశాలురు. తమ జీవితమునందెన్నియో తీవ్రతరమైన ప్రతిబంధకముల నెదుర్కొనుచు, ఆంధ్రదేశ చారిత్రక జగత్తున నవ యుగారంభ ప్రభావితమూర్తులైన కీ.శే. చిలుకూరి వీరభద్రరావుగారు, కీ.శే.

కొమఱ్ఱాజు లక్ష్మణరావుగార్ల మహోజ్జ్వల లేఖిని ఛాయలలో ద్విగుణీకృతోత్సాహమును సంతరించుకొనిరి. కళాప్రపూర్ణ బిరుదాంచితులును, దేశోద్ధారకులును అగు కీ.శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి పతాక ఛాయను నిలిచి, వారు వెలువరించిన భారతి వ్యాసపరంపర వాటికవే నిదర్శనములు.

శ్రీ కోలవెన్ను రామకోటేశ్వరరావు, శ్రీ నేలటూరు వెంకటరమణయ్య, శ్రీ పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు శ్రీ ఆచంట జానకిరాం, శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావు మొదలుగా గల ప్రభృతు లెందలెందరో వచ్చి ఉండిపోవుచుండెడివారు. సర్వసాధారణముగా కీ.శే.అడవి బాపిరాజు గారు వచ్చినపుడెల్ల మామయ్యగారింటనే బసజేసెడివారు. రాత్రి భోజనములైన వెనుక ఎన్నో విషయములను గురించి సావధానముగ చర్చలు జరుగుచుండెడివి. శ్రీ బాపిరాజుగారిని మేము వేధించగ వారు గొంతెత్తి బహుశ్రావ్యముగ నాలపించెడివారు. "ఒకరీని నానబెట్టాను; ఒకరీని చితుకాగొట్టాను; ఒకరీని చీల్చివేశానోయ్‌బావా". మేమందరము ఆనందించుచుండగా శ్రీ బాపిరాజు గారు మరల నందుకొనెడివారు. "ఎవరీని నానాబెట్టావ్; ఎవరీని చీల్చివేశావోయ్ బావా?" మరల వారు "సున్నాన్నీ నానబెట్టాన్; పోకల్నీ చితుకాగొట్టాన్; ఆకుల్నీ చీల్చివేశానోయ్ బావా" అని హావభావవిన్యాస మందహాసములతో 'పాట బాగున్నదా' బావా అనెడువారు మామయ్యగారిని. అపుడు మామయ్యగారు ఆయనను మనసారా కౌగలించుకొని 'బాపిబావా, ఎంత బాగుందీ పాట' అనే ఆనాటి వారుభయుల సంభాషణలు, అట్టి మనోహర సన్నివేశాలను తిలకించిన నేను ధన్యుడననుకొందును.

కవిసామ్రాట్టులు, బహువిధ గ్రంథకర్తలు; శ్రీమద్రామాయణకల్పవృక్ష రచనా పుంభావమూర్తులునునైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 'అన్నా' యనుచు ఎంతో ఆప్యాయముతో వచ్చి మామయ్య గారింటనే బసచేసెడివారు. వారప్పుడప్పుడు తమ కిన్నెరసాని పాటలు వినిపించెడివారు. అట్టి మనోహర సన్నివేశములు నే నేరీతిని మరువగలను?

లక్ష్మీ సరస్వతులొక చోట నుండ రనడానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి జీవితము ప్రబలమైన నిదర్శనము. "శర్మగారు సరస్వతికి ముద్దుకొడుకు 'లక్ష్మికి సవతిబిడ్డ' వంటివారయినారు" అంటారు శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు.

మామయ్యగారి సహచరులలో శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు ముఖ్యులు. "శర్మగారికి చరిత్ర పరిశోధన సహజక్రీడ, శాసన పరిష్కారము యభిమానవిద్య. లిపి శాస్త్రమున వీరితో సమానమైన జ్ఞానము గల వారి సంఖ్య యల్పిష్టము. లిపిమర్మ విశారదుడగుటచే నెట్టి ప్రాచీన శాసనము యొక్క గుప్తార్థమును, ఆయనకు బట్టబయలు. శర్మగారు సంపాదించి ప్రకటించినన్ని శాసనములు మరి ఎవ్వరును ప్రకటించియుండలేదు. ప్రాచీన దక్షిణ హిందూదేశ

చరిత్రయందు శర్మగారికి తెలియని విషయము లేదు. ఎంతటి నిగూఢమైన సమస్యయైనను వీరి దృక్పథమున బడిన చిక్కులను బెడబాసి విశదముకాగలదు" అంటారు శ్రీ నేలటూరివారు.

"నిరాడంబరము, సహృదయత్వము, అన్నిటికి మించిన ఆంధ్రత్వము, వీరిలోని విశిష్టత, అని పిల్లలమర్రివారును; కవి, విమర్శకుడు, కృతికర్త; కృతిభర్త; కథకుడు చారిత్రక పరిశోధకుడు; మహాపండితుడు, ప్రజాసేవకుడు, అని ప్రయాగవారును; ఆంధ్రసారస్వత ప్రపంచములో ఈనాడు మన సోమశేఖరుడు సర్వజన సమాదరణీయుడై ఉత్తమ చరిత్ర గ్రంథరచయితగా పేరుపొందుతున్నాడంటే లక్ష్మణరాయదాతని కిచ్చిన ఉన్నత విద్యాశిక్షణమే కారణమని మనవి చేస్తున్నాను అని శ్రీ నిడుదవోలు వెంకట్రావుగారు అనిన మాటలు శ్రీ శర్మగారి సర్వజన సమాదరణీయతను చాటుచున్నవనుటలో అతిశయోక్తి లేదు.

అయిననేమి? "డిగ్రీలులేని ఈ పాడుకాలానపుట్టి" అని కవిసామ్రాట్టులనినట్లు వారికింతకు మున్నెప్పుడో యీయవలసి యుండిన డాక్టరేటు గౌరవ బిరుదమైనను ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ప్రసాదించలేకపోవుట బహుశోచనీయమైన సంగతి. వారు పరిశోధించి వ్రాసిన వ్యాసములు శతాధికములు. మామయ్యగారియందు మూర్తీభవించి యుండిన సత్యజిజ్ఞాస, నిశితదృష్టి వాటియందు ప్రద్యోతకములగుచుండును.

1957 సం॥ నుండి ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు తిరిగి మామయ్యగారిని ఎపిగ్రఫీ లెక్చరరుగ నియమించిరి. తుదకీ స్వల్పకాలమందైనను వారి కా డిగ్రీ లేని లోటును తీర్చలేక పోయిరి. రాలిపోయిన మణిపూసవలె వారును గతించిరి. ఏమనుకొనిననేమి, అట్టి యమృతమూర్తులు మరి కానరారు. మృదుమధుర మనోహరశైలిచే నొప్పారుచున్న వారి గద్యరచనలచే ఆంధ్రమాతను పుల్కరింపజేసి, ఆంధ్రదేశ చారిత్రక, సాంస్కృతిక వాఙ్మయాది వివిధ రంగములలోనేగాక పురాతన లిపి శాస్త్రమందును యసమానమైన కీర్తి నార్జించిన వీరు మహామహిమోపేతులై విలసిల్లిన ఆంధ్రవిద్వన్మహాపురుషులే కొలది మందిలోనో వీరొక రనుట నిస్సందేహము.

శ్రీ సోమశేఖర శర్మగారి పట్ల ఆంధ్రులకున్న గౌరవ చిహ్నముగా వారి యమూల్య రచనలను సాంతము సేకరించి గ్రంథస్థము చేయుట, ఆంధ్ర విశ్వవిద్యాలయము నందు, వారి స్మారకచిహ్నముగ నేదేని నొకటేర్పరుచుట ద్వారా వారి ఆత్మకు శాంతి చేకూర్చిన వారమగుదుము. యిందుకు దేశమందలి వివిధ సాహితీసంస్థలు ముఖ్యముగా ప్రభుత్వము పూనుకొనుట కనీసధర్మము.

భగవంతుడు వారి ఆత్మకు శాంతినిచ్చుగాక యని ప్రార్థిస్తూ వారికివే నా ప్రణామాంజలు లర్పించుకుంటున్నాను. ***(శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ స్మారకసంచిక నుండి పునర్ముద్రితము)***

## అనుబంధము - 2

# సుప్రయోగ నది ఏది? అది ఏ నామాంతరముతో నేడు వ్యవహరింపబడుతున్నది?

**- మల్లంపల్లి సోమశేఖరశర్మ**

సుప్రయోగ అనునది 'భగవదజ్జుక' మను ప్రహసనమున[1] ఒక ప్రసిద్ధ నదిగ చెప్పబడినది. 'భగవదజ్జుక' కర్తీపల్లవ వంశజుడయిన మహేంద్రవర్మయని యూహించుచున్నారు. మహేంద్రవర్మ క్రీస్తుశకము ఏడవ శతాబ్ది ఆరంభమున కాంచీపురము నేలిన పల్లవరాజు. ఇతడు సంగీత సాహిత్యములందు చతురుడని ప్రతీతి. 'మత్తవిలాస' మన్నది కూడ ఇతడు వ్రాసిన మరియొక ప్రహసనమని పరిశోధక పండితులూహించుచున్నారు. మహేంద్రవర్మ కుడిమియామలై శాసనమువలన ఆ మహారాజునకు సంగీతశాస్త్రమునందుగల ప్రావీణ్యము విశదమగుచున్నది. మహేంద్రవర్మయే గుహాలయ నిర్మాణమును దక్షిణదేశమున మొదలుపెట్టించెనని తెలియుచున్నది. ఈ గుహాలయ నిర్మాణ విద్యనీతడు ఆంధ్రదేశము నుండియే గ్రహించెననియు, ఈతడు ప్రాయికముగ మొదట ఆంధ్రదేశీయుడో లేక ఆంధ్రదేశముతో సంబంధము గలవాడో అయి యుండవలెననియు పరిశోధక పండితులు కొందరభిప్రాయము. ఈ మహారాజుదని అనుమానింపబడుచున్న, నిర్ధరింపబడుచున్న భగవదజ్జుక ప్రహసనమున సుప్రయోగానది పేర్కొనబడినది. యమపురుషుడు వేశ్యయైన అజ్జుక ప్రాణములను పాశములకు దగిలించి లంకాభిముఖుడై పోవుచు ముందు గంగానదిని, తరువాత వింధ్య పర్వతములను, పిదప నర్మదానదిని, అటువెనుక సహ్యాపర్వతములను, ఆ వెనుక గోలేయి (గోదావరి), కృష్ణవెణ్ణా నదులను అటు తరువాత పశుపతి భవనమును, ఆ తరువాత సుప్రయోగను, అనంతరము కాంచీపురమును, పిమ్మట కావేరీ తామ్రపర్ణీనదులను, మలయ పర్వతమును గడచి వెళ్లినట్లు భగవదజ్జుకమున తెలుపబడినది. ఈ పైన చెప్పబడిన వాటిలో మనకంత ఎక్కువ పరిచయము లేనిది ఒక్క సుప్రయోగనదియే. అది ఇప్పుడెక్కడ నున్నదో మనకు దెలియుటలేదు. పశుపతి భవనమన్నది శ్రీశైలమని స్పష్టమగుచున్నది. పైన చెప్పినవన్నియు సరిగా ఉత్తరమున నుండి దక్షిణమునకు వచ్చు త్రోవలో ఒకదాని తరువాత నొకటిగ నున్నవని వాని వరుసను బట్టియే తెలియుచున్నది. గోదావరీ కృష్ణా నదుల తరువాతను, కాంచీపురమునకు పూర్వమునను పశుపతి భవనము చెప్పబడుటచే అది శైవక్షేత్రమయిన శ్రీశైలమనుటకు సందియము లేదు. శ్రీశైలము దాటి దక్షిణమునకు కాంచీపురమునకు వచ్చుచో మార్గమధ్యములో తగులునది సుప్రయోగానది. కాంచీ, శ్రీశైలములకు మధ్య నదులు చిన్నవేమి పెద్దవైననేమి - అనేకములు కలవు. వీనిలో సుప్రయోగ ఏది?

సుప్రయోగ పేరు మనకిప్పుడపరిచితమయినను అది కొత్తదిగ గన్పట్టదు. పురాణము లందును, మహాభారతమునందును గూడ ఇది పేర్కొనబడినది. మార్కండేయ పురాణమున

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యా తథాపరా
తుంగభద్రా సుప్రయోగా వాహ్యకావేర్యథాపగా
సహ్యపాదాద్వినిస్సృతా ఇత్యేతాః సరిదుత్తమాః

అని కలదు. మారన మార్కండేయ పురాణమున భారతవర్షీయ నదులను బేర్కొనుచు ఈ విషయమునే వచనమున నిట్లు వెల్లడించెను.

"సువాహిని పయోష్ణి నిర్వింధ్య నిషధాపతి వైతరణి సినీవాలి కుముద్వతి మహాగౌరి దుర్గయంతశ్శిరయను మహా వాహినులు వింధ్యంబునం బుట్టె గోదావరి భీమరథి కృష్ణవేణి తుంగభద్ర సుప్రయోగ కావేరి యను నదులు సహ్య పర్వతంబున నుద్భవించె."

భారతవర్ష వర్ణనము సందర్భమున నదులు వర్ణించునపుడు పురాణములన్నియు కొంచెమించుమించుగ నీరీతి నే సహ్యమున బుట్టు నదులను పేర్కొన్నవి; చూడుడు :

"గోదావరీ భీమరథీ కృష్ణవేణాథబంజులా
తుంగభద్రాసుప్రయోగా బాహ్యకావేర్యథాపిచ
దక్షిణ ప్రవహానద్యః సహ్యపాదాద్వినిస్సృతాః

– బ్రహ్మాండ పురాణము

"గోదావరీ భీమరథీ కృష్ణవేణాథ, వంజులా
తుంగభద్రా సుప్రయోగా కావేరీచ తథాపగా
దక్షిణాపథ నద్యస్తు సహ్యాపాదాద్వినిస్సృతాః

– వాయు పురాణము

'గోదావరీ భీమరదీ కృష్ణవేణాచ వశ్యతా
తుంగభద్రా సుప్రయోగా కావేరీచ ద్విజోత్తమాః

– కూర్మ పురాణము

"గోదావరీ భీమరథీ కృష్ణవేణాచ వంజులా
తుంగభద్రా సుప్రయోగా వాహ్యా కవేరిచైవ తు,
దక్షిణాపథ నద్యస్తాః సహ్యపాదాద్వినిః సృతాః

– మత్స్య పురాణము

మహాభారతము వన పర్వమునను, భీష్మ పర్వమునను వేణాకృష్ణవేణా నదులతోపాటు సుప్రయోగ కూడ పేర్కొనబడినది; చూడుడు :

**తమసా నర్మదాచైవ నదీగోదావరీతథా**
**వేణోపవేణా భీమాచ వడవాచైవ భారత**
**భారతీ సుప్రయోగాచ కావేరీ ముర్మురా తథా**
**తుంగవేణా కృష్ణవేణా కపిలా శోణేవచ**
**ఏతానద్యస్తు ధిష్ణయానాం మాతరోయాః ప్రకీర్తితాః**

**-వన పర్వము**, అధ్యా. 222శ్లో 24-25

**"గోదావరీం నర్మదాంచ బాహుదాంచ మహానదీమ్,**
**శతద్రూం చంద్రభాగాంచ యమునాంచ మహానదీకు**
**నదీం వేత్రవతీంచైవ కృష్ణవేణాంచ నిమ్నగామ్**
**ఇరావతీం వితస్తాంచ పయోష్ణీం దేవికామపి**
**శరావతీం పయోష్ణీంచ వేగాం భీమరథీమపి**
**కావేరీంచులు కాంచాపివాణీం శతబలామపి**
**నీవారామహితాం చాపి సుప్రయోగాం జనాధిప**
**పవిత్రాం కుండతాంసింధురాజనీం పురమాలినీమ్**

**-భీష్మపర్వము**, అధ్యా. 3 శ్లో 14-21

పై శ్లోకముల వలన మనకెన్నియో నదులు తెలియవచ్చుచున్నవి. వీనిలో బాహుద (చెయ్యేరు) వంటి చిన్ననదులు గూడ చేర్పబడినవి. సుప్రయోగ మాత్రమేకాక గోదావరి, తుంగభద్ర, కృష్ణవేణ్ణల వంటి ప్రసిద్ధాంధ్ర దేశనదులు కూడ ఎన్నియో పేర్కొనబడినవి. వేణ, వేణ్న పేరులతో నొప్పు నదులు కృష్ణవేణ, వేణ, ఉపవేణ, తుంగవేణలు. కృష్ణా, గోదావరీ, తుంగభద్రలతో గలిపి సుప్రయోగను పేర్కొనుట వలన ఇది ఆంధ్రదేశము నందలి నదియే యనితోచును. పురాణములలో నదులను పేర్కొను సందర్భమున ఇది తుంగభద్రా కావేరులకు నడుమ చెప్పబడుట వలన ఆ రెంటికి నడుమనున్న పెద్దనది. పెన్నయే సుప్రయోగ యగునేమోయని సంశయము జనించుట సహజము. అందువలన అది పశుపతి భవనమునకును కాంచీపురమునకును నడుమనున్నట్లు భగవదజ్జుకమున చెప్పబడుటయు దాని కుపబలకమే కాని పూర్వోక్తములయిన వెణ్ణలలో కృష్ణవేణ కృష్ణానదిగను, ఒక వేణ-తుంగవేణ తుంగభద్రగను, ఉపవేణ వేణగంగ (Wain Ganga)గను, గుర్తించినచో

ఇంకను ఇక వేణ మిగులును. కాని పురాణ భారతాదుల యందలి భారతవర్షీయవర్ణమును గూర్చి ప్రత్యేకముగ ఇంతవరకు పరిశ్రమ చేసిన వారు కాన్పింపరు. ఈ నదుల పేర్లు సరియైనవో కాదో, అవియే ప్రాంతపువో, వాటిని గుర్తింపవీలగునో కాదో అట్టి పరిశ్రమ చేసినగాని తెలియదు. అదియును గాక ఇట్టి విషయమును తేల్చవలసి వచ్చినపుడు వేరు వేరు కూర్పులలోని, ప్రతులలోని పాఠములను గూడ పరిశీలింపవలసిన యవసరము గలదు. ఒక ప్రతిలోని పేరు మరియొకదానిలో మరియొక విధమున నుండుటయు కలదు. నేను పైనిచ్చిన పాఠములు కుంభకోణము ప్రతిలోనివి. అయితే పైని చెప్పినట్లు మిగిలిపోయిన ఒక వెణ్ణను పెన్ననదియేయని, దానిని సుప్రయోగగా గుర్తింపమన్న ఒక చిక్కు కలదు. ఈ వేణ వెణ్ణలతోపాటు సుప్రయోగయు చెప్పబడినది. అందువల్ల సుప్రయోగ ఏది అను విషయమును నిర్ధారించుటలో పురాణ భారతాదులను విడిచి అన్యసాధనము నాశ్రయించుట అవసరము.

ఈ సుప్రయోగానది తెలుగుదేశమున గానవచ్చిన ప్రాచీన శాసనములలో కూడ పేర్కొనబడినది. పూర్వము యువమహారాజ విష్ణుగోపుడని ఒక పల్లవ రాజుండెను. ఆతడు, ముండ రాష్ట్రములోని ఉరువుపల్లి అను గ్రామమును దానము చేసెను. ఆ యువమహారాజు క్రీస్తుశకము అయిదవ శతాబ్ది ఉత్తరార్థమున నున్నవాడు. దానమిచ్చిన ఉరువుపల్లి గ్రామమునకు తూర్పు, దక్షిణపు సరిహద్దుల సుప్రయోగా నది ప్రవహించుచున్నట్లు చెప్పబడినది. ఈ యొక్క శాసనముననేగాక కడప మండల ప్రాంతమునేలిన తెలుగు చోళులకు చెందిన పుణ్యకుమార భూపతి మాలెపాడు శాసనమునగూడ సుప్రయోగ పేర్కొనబడినది. పుణ్యకుమార మహారాజు హిరణ్యరాష్ట్రములోని బిరిపాడు (విరిపాడు?)ను దానము చేసెను. ఈ విషయమును దెలుపునదే మాలెపాడు శాసనము. దానమిచ్చిన బిరిపాడు గ్రామము సుప్రయోగానది దక్షిణ తటముననున్నట్లు శాసనమున చెప్పబడినది. దీనిని బట్టి సుప్రయోగానది ఉత్తర తటమున ముండ రాష్ట్రమును, దక్షిణ తటమున హిరణ్య రాష్ట్రమును, ఉండినట్లు స్పష్టమగుచున్నది. బిరిపాడన్నది ఇప్పుడెచ్చటనున్నదో తెలియకపోవుట వల్ల హిరణ్యరాష్ట్రము ఇప్పటియే ప్రదేశమునకు వర్తించునో తెలియరాకున్నది. హిరణ్య రాష్ట్రమను పేరే తరువాతి కాలమున హొన్నవాడిగ మారినది. 'వాడి' అన్నది మధ్యయుగపు శాసనములలో దేశవాచకముగ ప్రయుక్తమయినది. ఉదాహరణము : నొళంబవాడి, రట్టవాడి, గంగవాడి మొదలయినవి. హొన్ను అనగా హిరణ్యము. అందువలన హిరణ్య రాష్ట్రమును హొన్నవాడియు ఒక్క దేశ విభాగమునకే పేరనుటలో సంశయింపబనిలేదు. హొన్నవాడి రాష్ట్రకూట రాజయిన కృష్ణకణ్ణర దేవుని శాసనమున పేర్కొనబడినది. అందు ములికినాడు హొన్నవాడిలోనిదిగ దెలుపబడినది.

పుష్పగిరి, చినమాసపల్లి మొదలయిన గ్రామములు - కడపజిల్లాలోనివి - ములికినాటిలోనివి. అందువలన హొన్నవాడి ఒకప్పుడు కడప వరకును వ్యాపించి యుండినట్లు విదితము కాగలదు.

హొన్నవాడి పేరు విన్నంతనే మనకు దానితో పోలిక గల మరియొక పేరు స్ఫురణకు వచ్చును. అది అరొర్ణాయ్. టాలెమీ అను భూస్వరూప శాస్త్రజ్ఞుడు ఈ అరొర్ణాయ్‌ని తన భూస్వరూప శాస్త్రమున (geography) పేర్కొనినాడు. ప్రాక్సముద్ర తీరస్థములయిన రేవు పట్టణములను పేర్కొను సందర్భమున దీని ప్రస్తావము వచ్చును. "పొదుకె" అను రేవు పట్టణము అరొర్ణాయ్ సమీపమున నున్నట్లు టాలెమీ తెలిపినాడు. ఇతడు క్రీస్తుశకము రెండవ శతాబ్దినాటివాడు - ఇంతవరకు 'పొదుకె' అను రేవుపట్టణము ఎచటనున్నదో గుర్తింపగా లేదు. అరొర్ణాయ్ కూడ ఇంతవరకు గుర్తింపబడలేదు. పొదుకె అన్నదానిని కొందరు పరిశోధకులు పుదుచ్చేరి (Pondicheri) యే యని గుర్తించినవారు. కాని యిది అంత సంగతముగ కన్పట్టదు. పుదుచ్చేరి అన్నమాటయే అది కొత్తగా (పుదు అన క్రొత్తయని యర్థము) వెలసిన గ్రామమని స్ఫురింపచేయుచున్నది. పుదుచ్చేరి యంత ప్రాచీన కాలము నుండి యున్నదనుటకును ఆధారములు లేవు. అందువలన 'పొదుకె' పుదుచ్చేరి యనుటకు తగిన బలమైన ఆధారమేమియు లేదు. పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్‌సీ (Periplus of Erythrean Sea) అను మొదటి శతాబ్దినాటి మరియొక గ్రంథమున ఈ రేవుపట్టణమే పొదుక అను పేర పేర్కొనబడినది. దీని ననుసరించి ఈ పొదుక లేక పొదుకె క్రీస్తుశకము మొదటి శతాబ్దము నాటినుండియు ప్రసిద్ధమయిన సముద్రతీరస్థ నగరము (రేవు పట్టణములను) పూర్వము కరపట్టణములని వ్యవహరించువారు. కర యనగా గట్టు, ఒడ్డు. చాల ఎత్తయిన గట్టుకు కరకట్ట యనియు వ్యవహారము. 'కఱు' రూపాంతరమే కట్టు, గట్టు. శాసనములలో వచ్చు కఱ్తయనునది కఱుయొక్క సప్తమీ విభక్తి రూపము. గట్టుమీద, గట్టున అని యర్థము. 'గంగకఱుత' లేక గంగకఱ్త, గంగకర్త సముద్ర తీరమున నున్న పట్టణములగుటచే రేవుపట్టణములకు కరపట్టణములని వ్యవహారము పూర్వము.

స్వర్ణ-సొన్న, కర్మ-కమ్మ, ధర్మ-ధమ్మ అయినట్లే అరొర్ణాయ్, అరొణ్ణాయ్, అరొణ్ణ యగును. వేణ్య, వేణ్ణ, పళ్యెర, పళ్ళెర అయినట్లే హిరణ్య-హిరణ్ణయగును. హిరణ్ణయే విదేశీయులలో నోళ్ళలోబడి 'అరొణ్ణ'యైనదని నాయుద్దేశ్యము. అందువల్ల టాలెమీ యొక్క అరొణ్ణాయి హిరణ్ణ, హిరణ్య రాష్ట్రమేయని నేను గుర్తుంచుచున్నాను. ఈ అరొర్ణాయి దేశము ఉత్తరముగ మైసోలియా వరకు వ్యాపించియున్నదనియు, మైసోలస్ నది దిగువభాగమున దాని నీళ్ళచేత తడుపబడు ప్రదేశము 'మైసోలియా'యనియు టాలెమీ వ్రాసియున్నాడు. మెట్టను చాలదూరము వ్యాపించియున్న దేశమునందలి సముద్రతీర ప్రదేశమగు 'మాసొలియా'కు

'పోదుకె' రేవుపట్టణము చేరువనె ఉన్నదని 'పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్‌సి" అను గ్రంథమున చెప్పబడినది. మైసోలియా, మాసాలియా అను పేరు గల దేశమేదో తెలిసినప్పుడు గాని హిరణ్యరాష్ట్రము ఉత్తరమున ఎంతవరకు వ్యాపించియున్నదో తెలియదు. ఈ మాసాలియాయందు సన్నని 'మస్లిను'లు అతి విస్తారముగా తయారగునని "పెరిప్లస్ ఆఫ్ ది ఎరిత్రియన్‌సి" అను గ్రంథమున గలదు. వీటిని బట్టి (1) మైసోలియా లేక మాసాలియా అనునది పోదుక లేక పోదుకె అను రేవుపట్టణమునకనతి దూరమున వ్యాపించియున్నదనియు, (2) అది, మస్లినులకు ప్రసిద్ధికెక్కినదనియు (3) అది మెట్టను చాలదూరము వ్యాపించినదనియు తెలియగలదు. నా యుద్దేశ్యమున 'మైసోలియా'ను బట్టియే 'మస్లిను' పదమేర్పడినది. దేశము పేరు మైసోలియా లేక మసోలియా లేక మాసాలియా; ఆ దేశము గుండా ప్రవహించునది పేరు మైసోలస్; ఆ దేశమున తయారగు సన్నని నూలుబట్టలకు మస్లిను (మైసోలిన్ లేక మసొలిక్ రూపాంతరమే మస్లిను) లని పేరు.

కాని ఇంతవరకు మస్లిను పదము మెసొపొటేమియా యందలి టైగ్రిస్ నదీతీరముననున్న మోసల్ (మౌసల్, మౌసిల్ అను రూపాంతరములు) పట్టణమును బట్టి వచ్చినదని విశ్వసింపబడుచున్నది. 'ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా'లో ఇట్లే చెప్పబడినది. యూల్ తన 'హాబ్సన్-జాబ్సన్ అను నిఘంటువునందు గూడ 'మోసల్' నుండియే 'మస్లిన్' వచ్చినదని చెప్పినాడు. కాని ఆశ్చర్యమేమన, అతడు మస్లిను పదమునకు ఫుట్‌నోట్ ఇచ్చియున్నాడు. అందు ఇట్లని వ్రాసినాడు:

"మస్లిను పదము మైసోలియా నుండి వచ్చినదను ప్రతిభాత్మకమైన సూచనను ఎక్కడో చదివినాము. మైసోలియా ప్రాచీన కాలమున నుండియు సన్నని నూలుబట్టలకు ప్రసిద్ధికెక్కినది. (టాలెమీ వ్రాసిన దాని ననుసరించి మైసోలియా యన్నది మచిలీపట్నము చుట్టుపట్ల నున్న దేశము పేరు)"

'మైసోలియా' నుండి మస్లిను వచ్చినదను సిద్ధాంతమున ఆదరము లేకపోవుటచేతనే యూల్ ఈ విషయమును 'ఫుట్‌నోట్'లో ఇచ్చినాడు. కాని సత్యమదేయని నా నమ్మకము. పదుమూడవ శతాబ్ది నాటి మార్కొపోలో అను విదేశయాత్రికుడు కూడ యూల్ చెప్పిన యభిప్రాయమునే వెల్లడించినాడు. టైగ్రిడ్స్ నది మీద మౌసల్‌ను గురించి వ్రాయుచు 'మసొలిన్స్' అను పేరు గల బంగారు పట్టుబట్టలు అక్కడ తయారగునని మార్కొపోలో చెప్పినాడు. ఇందరు చెప్పినను ఇది సరియైన యభిప్రాయము కాదనియే నా యూహ. క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో మోసల్ లేక మౌసల్ అను పట్టణము ప్రసిద్ధమయినది కాదు. క్రీస్తుశకము అయిదారు శతాబ్దులలోనే దానికి ప్రాముఖ్యము వచ్చినది (చూడుడు : ఎన్‌సైక్లొపేడియా ఇస్లామికా'లో మోసల్‌పదము) క్రీస్తుశకము మొదటి శతాబ్దులలో అది మస్లినులకు

ప్రసిద్ధికెక్కినట్లు ఎక్కడను చెప్పియుండలేదు. "మస్లిక్ అనునది 'మోసల్' నుండి వచ్చినదని మొట్టమొదట చెప్పినవాడు అరబ్బీ చరిత్రకారుడును, యాత్రికుడును అయిన మసూదీ. ఇతని పూర్తిపేరు అబుల్‌హసన్ అలీ ఇబన్ హసన్ ఇబక్ ఆలీ ఉల్‌మసూదీ. ఇతడు క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్ది అంతిమభాగమున బాగ్దాదు పట్టణమున జన్మించెను. తొమ్మిదవ శతాబ్దికి పిదప మోసల్ మస్లినులకు ప్రసిద్ధికెక్కిన దన్నను మైసోలియా నుండి మస్లిను వచ్చినదన్న మన వాదమునకు భంగము కలుగదు. ఈ కారణముల వలన మైసోలియా నుండియే మస్లిను వచ్చినదని నేను నమ్ముచున్నాను.

మస్లిను మాట ఎట్లున్నను, మైసోలియా ఎక్కడనున్నదో, మైసోలస్ నది యన్నదేదో ఇంతవరకును తేలలేదు. మైసోలస్ ఏది అన్న విషయమున పరిశోధక పండితులలో భేదాభిప్రాయములు గలవు. కొందరు మైసోలస్ గోదావరి యన్నారు. మరికొందరు కృష్ణానది యన్నారు. మైసోలస్ కృష్ణయనుటకు గల కారణమిది. (౧) మైసోలస్‌కు మచిలీపట్టణమునకు గల పోలిక, (౨) కృష్ణానదీ ముఖద్వార ప్రాంతపు దేశము మస్లినులకు ప్రసిద్ధికెక్కుట. కాని ఈ రెండును గూడ నిలిచే ప్రమాణములు కావు. మచిలీపట్టణము అంత ప్రాచీనమైన రేవు పట్టణము కాదు. గోలకొండ కుతుబుశాహి సుల్తానుల రాజ్యారంభ కాలమున పదునైదువ శతాబ్దిలో ఏర్పడిన రేవుపట్టణమది. అందువలన మచిలీపట్టణ ప్రాంతమే టాలెమీ నాటి మైసోలియాయని చెప్పుటకు వీలులేదు. ఇక మస్లినులకా, విదేశయాత్రికుల వృత్తాంతములను బరిశీలించినచో ఒక్క కృష్ణాతీర ప్రాంతమేగాక నెల్లూరు ప్రాంతము కూడ ప్రాచీనకాలము నుండియు మస్లినులకు (సన్నని నూలుబట్టలకు) ప్రసిద్ధిగాంచినదే. చూడుడు ; ఒక విదేశీయాత్రికుడు ఏమని వ్రాసియున్నాడో -

"Policate is to the north of St. Thomas and the factory (which) the Dutch have established there) is one of the best they have in the Indies, by reason of the cotton cloths, of which they have great warehouses full there".

అందువలన కృష్ణాతీరమున నుండి పులికాట్ వరకును గల ప్రాంతమంతయు చక్కని నూలుబట్టలకు (మస్లినులకు) ప్రసిద్ధికెక్కినదే. ఈ కారణమున మచిలీపట్టణ ప్రాంతము 'మైసోలియా' యనుట కుదురదు. మైసోలస్ కృష్ణ యనుటకయినను ఈ మాత్రము కారణములు కలవుగాని గోదావరి యనుటకు అసలే లేవు. అట్లయిన మైసోలస్ ఏది, మైసోలియా ఏది?

హిరణ్యరాష్ట్రమును, టాలెమీ - అరొర్ణాయియు ఒక్కటేయని తెలిసికొంటిమి. అరొర్ణాయ్ మైసోలియా వరకు ఉత్తరమున వ్యాపించియున్నదనుటచే హిరణ్యరాష్ట్రమంతవరకును వ్యాపించియున్నదన్నమాటే. అనగా హిరణ్యరాష్ట్రముత్తరదిశను మైసోలియాయందలి మైసోలస్

వరకును వ్యాపించి యుండవలెను. శాసనములననుసరించి హిరణ్యరాష్ట్రముత్తరమున ...ప్రహూగా నది వరకును వ్యాపించియుండినట్లు విదితమయినది. అందువలన మైసోలస్ మరియు సుప్రయోగము ఒక్కటేయని తేలుచున్నది. ఇన్ని తిరుగుళ్ళు పడినను మైసోలస్‌ను గురించి మనకెంత తెలిసినదో సుప్రయోగ గురించియు అంతే తెలిసినది. హిరణ్య రాష్ట్రమును బట్టుకొన్న సుప్రయోగ విషయము తేలలేదు. సుప్రయోగ హిరణ్యరాష్ట్ర, ముండ రాష్ట్రములకు నడుమ బ్రవహించుచుండుట వలన ముండ రాష్ట్రమును బట్టుకొన్న ఈ విషయము తేలునేమో చూతము.

ముండరాష్ట్రము ఎక్కడిదో పరిశీలింతము. ప్రాచీన పల్లవ చాళుక్య శాసనములను బరిశీలించినచో చాళుక్యరాజ్యమునందలి దేశవిభాగములకు విషయములన్నియు, పల్లవరాజ్యమందలి దేశవిభాగములకు రాష్ట్రములనియు, పేర్లుండినట్లు తెలియగలదు. చాళుక్యులకు పల్లవరాజ్యమంతయు వశమైపోయిన పిదప రాష్ట్రమన్నది అంతరించి విషయమే మిగిలిపోయినది. ఈ 'విషయము' మధ్యయుగము నాటి శాసనములలో 'నాడు'గ మారిపోయినది. ఉదా : వేంగీవిషయము–వేగినాడు. కమ్మరాష్ట్రము–కమ్మనాడు మొ॥

| **శాసనమున్న గ్రామము** | **ముండనాటిలోని గ్రామము** | **ముండనాటిలోనిదిగ చెప్పబడిన గ్రామము ఇప్పటి ఏ గ్రామమగును? ఏ తాలుకాలోనిది?** | |
|---|---|---|---|
| గండవరము | కంఠనారాయణ పురము అనుకులోత్తుంగ చోలిపురము | కంఠనారాయణపురమే కంఠపురము లేక కంఠాపురమై ఇప్పటి గండవరమైనది | కోవూరు |
| కొడవలూరు | కొడవలూరు | కొడవలూరు | కోవూరు |
| నెల్లూరు | తామరైమడుపు అను చిత్రమేళినల్లూరు | దామరమడుగు | కోవూరు |
| నెల్లూరు | మావటికుంటై | మోదేగుంట | కోవూరు |
| వేగూరు | వేలూరు | ముండనాటిలోనిదని చెప్పబడిన గ్రామము | కోవూరు |
| వేగూరు | వేగూరు | ఒక శాసనమున వేగూరని మరియొక శాసనమున వేలూరనియున్నది. శాసనమున్నది వేగూరగుటచే వేలూరు పొరపాటనియు అది వేగూరై యుండుననియు నా నమ్మకము | కోవూరు |

| | | | |
|---|---|---|---|
| నెల్లూరు | అలంగాడు | అలగానిపాడు (?) | కోవూరు |
| చికవోలు | తక్కులం | తెలియదు | |
| బాపట్ల | (వె)లుకలూరు | తెలియదు | |

క్రీస్తుశకము పదునొకండు, పండ్రెండు, పదుమూడు శతాబ్దుల నాటి నెల్లూరు మండల శాసనములలో ముండనాడు లేక ముండైనాడు అన్న దేశవిభాగమొకటి తెలియవచ్చును. ఇది ప్రాచీన పల్లవశాసనములలో పేర్కొనబడిన ముండ రాష్ట్రమే యనుటకు సందియము లేదు. ముండ లేక ముండైనాడు లోనివిగ చెప్పబడిన గ్రామములను గుర్తింప గుదిరినచో ముండనాడు లేక రాష్ట్రమెచ్చటిదో సుకరముగ దెలియగలదు. ముండనాడును పేర్కొను శాసనములు ఏ గ్రామములనున్నవో ముండనాడు నందలివిగ చెప్పిన గ్రామములు ఇప్పుడు ఏ గ్రామములుగా గుర్తింపవీలగునో, అవి ఎచ్చటివో 82వ పుటలోని పట్టికలో తెలుపబడినది. ముండనాడును పేర్కొను శాసనములన్నియు నెల్లూరు మండలముననే యుండుటచేత ముండనాడు లేక ముండరాష్ట్రము నెల్లూరిలోనిదని వేరునుడవ నక్కరలేదు.

ఈ కడపటి మూడు గ్రామములును అలంగాడు, తక్కులం (వె)లుకలూరు తక్క ముండనాటిలోనివిగ చెప్పబడిన మిగిలిన గ్రామములన్నియు కోవూరు తాలూకాలో నున్నవి. దీనినను సరించి చూచినచో పూర్వపు ముండరాష్ట్రము ఇప్పటి కోవూరు తాలూకా కనువర్తించునని చెప్పవచ్చును. కోవూరు తాలూకాకు దక్షిణపు సరిహద్దు పెన్ననది. ముండ రాష్ట్రమునకు దక్షిణపు సరిహద్దు సుప్రయోగా నది యగుటచేత పెన్ననదియే సుప్రయోగ యనుటకు సంశయమక్కరలేదు. అనగా పూర్వపు ముండరాష్ట్రము ఇప్పటి కోవూరు, ఆత్మకూరు తాలూకాల మీదుగ పెన్నకుత్తరమున వ్యాపించియుండినట్లు విశదము కాగలదు.

సుప్రయోగకు దక్షిణ తీరమున నున్నది హిరణ్యరాష్ట్రము. టాలెమీ యొక్క అర్కొర్ణాయ్-తరువాతి కాలపు హొన్నవాడి. పైన తేలిన దానిననుసరించి సుప్రయోగ-పెన్నయే మైసోలస్ అని రూఢమగుచున్నది. మైసోలియా గుండా ప్రవహించునది మైసోలస్. చోళదేశమునకు 'సోలియరట్ట'మని (చోళ రాష్ట్రమని) 'సోలి'యని వ్యవహారము గలదు. చోళ, చోడ, చోటి, శోటి, సోలియ, సోళియ పదములు పర్యాయవాచకములు. యువాన్‌చాంగ్ అను చీనాదేశ బౌద్ధయాత్రికుడు ఏడవ శతాబ్దివాడు - కడప ప్రాంతమును చులియ (సోలియ-చోళ) అని వ్యవహరించియున్నాడు. కడప ప్రాంతమును తెలుగుచోళులు ఏడవ శతాబ్దినుండియు పాలించుచుండిరి. వీరు నెల్లూరు వరకును వ్యాపించిరి. కాంచీపురము మొదలు కృష్ణవరకు ఒకప్పుడు వీరి పాలనము సాగినది. తెలుగుచోళులకు గల కాంచీపురవరేశ్వర బిరుదమే వీరు కాంచిని గూడ పాలించినవారని తెలుపుచున్నది. కడప మండలములోని పొత్తపి, నెల్లూరు మండలములోని నెల్లూరు (విక్రమసింహపురము) వీరి రాజధానులు. అందువలన ఈ తెలుగు

చోళుల దేశమే మైసోలియా, లేక మాసోలియా (మహాచోళ, లేక మధ్యచోళ) అని నా నమ్మకము. ఈ చోళదేశము గుండా ప్రవహించుటచేతనే పెన్నకు మైసోలస్ అని పేరు కలిగినది. ఈ దేశమున తయారైన కారణముననే నూలుబట్టకు మైసోలిన్, లేక మాసోలిన్ లేక మస్లిన్ అని ప్రసిద్ధి యేర్పడినది. టాలెమీ నాటికి, ఇప్పటికి కూడ కడప ప్రాంతదేశము ప్రత్తిపంటకు ప్రసిద్ధమయిన నల్లరేగడభూమి. ఇది ప్రాచీనకాలము నుండియు నూలుబట్టకు ప్రసిద్ధిగన్నదన్న ఆశ్చర్యము లేదు. రాష్ట్రకూటుల కాలమున మైసోలిన్‌యా హొన్నవాడిలో - హిరణ్యరాష్ట్రములోని అంతర్భాగమయినది.[3]

References —


1. భగవదజ్జుకమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్రీకరించియున్నారు. చూడుడు. భారతి, ౧౯౨౪ సంచికలు ౩ ౧౦ ౧౧

2. పురాణ భారతాదులకుగల వేరు వేరు ప్రతులలో వేణ నదికి ఈనామాంతరములున్నవి. వైణి (వాయు), వెణ్ణా (భాగవతము), వేణ (వదాహము), వీణా (మహాభార. భీష్మ) పర్గిటరు వేణను పెన్ననదిగ గుర్తించినాడు (చూడుడు - మార్కండేయ పురాణము నోట్సు పుట 303). బిమలచరణలాగారు దీనిని తుంగభద్రగా గ్రహించినారు. కాని యిది పొరపాటు.

3. పొదుకె లేక పొదుక్కయన్నదియు ప్రాచీన పల్లవ శాసనములలో వచ్చు పలక్కడ, పద్దుక్కరయనునదియు, సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున పేర్కొనబడిన పాలక్కడయు ఒక్క నగరము పేరులేయనియు, ఒక్క పేరు వికృతులేయనియు నా నమ్మకము. నా యభిప్రాయమున ఈ పట్టణము ఇప్పుడు పులికట్ అను పేర వ్యవహరింపబడుచున్నది. 'పులికట్' పూర్వపు యూరోపియను యాత్రికుల వృత్తాంతములలో ఇట్లు పలు విధముల వ్రాయబడినది:

   Pallicatta (పల్లికట్ట) Pallicata (పల్యకట్ట) - పల్లకట్ట (పల్యపల్ల-వేణ్య-వెణ్ణవలె) Pallecat (పల్లీకట్) Palliacatte (పల్యకట్టె) Policat (పులికట్ అని వ్యవహారము) కాని ఇది నిజమునకు పలికట్ కాని పులికట్ కాదు. Pu ను Pun (పన్)లో వలెను, Purchase (పర్‌ఛేస్)లో వలెను 'ఫ'గనే పలుకవలెను. Palicatta (పలికట)నే Pulicatగ వ్యవహరించుచున్నారు.

   ట, డ గను, ద, డ గను మారుట ప్రసిద్ధమే గదా! ఉదా : తటాకము, తడాగము; నాదెండ్ల-నాడెండ్ల, అంధ్రు-అండ్రు, లడలకు అభేదము. కాగా పలక్కడ, పలకడ, పద్దుక్కర, పద్దుక్కడలు రూపాంతరములగుచున్నవి.


◉

# Mallampalli Somasekhara Sarma Centre for Historical Studies

## NELLORE, A.P.

## PUBLICATIONS LIST

1. A Comprehensive History of Nellore District

   - Editor : Dr. G. Venkateswara Rao

2. Glimpses of Freedom Struggle

   - Dr. M. Pattabhi Rama Reddy

3. ప్రాచీన విశ్వవిద్యాలయములు

   - ఎ. నమ్మాళ్వార్

4. Present movements in India - with special reference to Venkatagiri Zamindari

   - Dr. G. Venkateswara Rao

5. ప్రథమ భారత స్వాతంత్ర్యానికి నూటయాభై సంవత్సరములు

   - సర్దార్ భగత్‌సింగ్ - డా॥ జి. వెంకటేశ్వర రావు

6, CL 10 - Dr. M. Pattabhi Rama Reddy Commemoration Volume

   - Editor : Dr. G. Venkateswara Rao

7. చరిత్ర రచనలో అగ్రగణ్యులు కొమర్రాజు లక్ష్మణరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ - తిరుమల రామచంద్ర

8. నెల్లూరు జిల్లాలో స్వాతంత్ర్యోద్యమం

   - సంపాదకులు : డా॥ జి. వెంకటేశ్వరరావు

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | GVP01FK49 | Date | 8/12/2020 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CJ, 65 | | |
| Missing Pages | 1to2 | | |
| Prepared | Deepika | Scanned | Mounika |
| BOOK SIZE | H 8.2 W 5.5 | Pages | 69 |